ఈం

ఓం శ్రీం ఐం హ్రీం స్వాహా

# శ్రీవిశ్వేశ్వరీసూక్తమ్

నామ

# తంత్రోక్తరాత్రిసూక్తమ్

(చండీసప్తశతీగ్రంథాన్తర్గతప్రథమచరిత్రమ్)

వ్యాఖ్యాత : రావి మోహనరావు



ప్రకాశకులు

**రావి మోహనరావు,** M.Sc., M.A., (Sanskrit)

**404, జంజనం కాంప్లెక్స్, చీరాల - 523 155.**

శ్రీః

శ్రీవిశ్వేశ్వరీసూక్తమ్ నామ

# తంత్రోక్తరాత్రిసూక్తమ్

**(చండీసప్తశతీగ్రంథాన్తర్గతప్రథమచరిత్రమ్)**

**వ్యాఖ్యాత : రావి మోహనరావు**

ప్రథమముద్రణ : 22.08.2020, **వినాయకచవితి**, శనివారం
ప్రతులు : 500
పుటలు : 48
వెల : రూ. 30/-


**RAVI MOHANRAO, M.Sc., M.A., (Sanskrit)**
**404, Janjanam Complex,**
**Opp. I Town Police Station,**
**Chirala - 523 155.**
**Cell : 94401 15411**

**D.T.P. by :**
**P.PARVATHI**
**Cell : 74165 86775**

**Printed at :**
**Karshak Art Printers**
**HYDERABAD**



ఓం శ్రీం ఐం హ్రీం స్వాహా

**తంత్రోక్తరాత్రిసూక్తమునకు**

**ప్రధాన - ఉపయుక్త గ్రంథసూచ్యాధారంగా**

**'*మృణాళినీ వ్యాఖ్య*' వెలువరించదమైనది.**

**- రామోరా.**

## ప్రధాన - ఉపయుక్త గ్రంథసూచి



1. హలాయుధాది కోశగ్రంథములు.
2. శ్రీలలితారహస్యసహస్రనామస్తోత్రమ్
   అ) శ్రీభాస్కరాచార్యుల వారందించిన '**సౌభాగ్యభాస్కరభాష్యమ్**'
   ఆ) శ్రీమదాదిభట్ల నారాయణదాసుగారందించిన '**తల్లివిన్కి**'
   ఇ) శ్రీశ్రీశ్రీకల్యాణానందభారతీమాన్తాచార్యుల వారందించిన '**శ్రీకల**'
   ఈ) శ్రీభట్టనారాయణుల వారు అందించిన '**జయమంగళవ్యాఖ్య**'
3. శ్రీభాస్కరాచార్యులవారి '**వరివస్యారహస్యమ్**'.
4. శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రమ్.
   అ) జగద్గురు శ్రీశంకరభగవత్పాదుల వారి '**శ్రీవిష్ణుసహస్రనామభాష్యమ్**'
   ఆ) శ్రీపరాశరభట్టరు వారి '**శ్రీవిష్ణుసహస్రనామభాష్యమ్**'
5. శ్రీమద్భగవద్గీత.

**'ఎందరో మహానుభావులు - ఎన్నో గ్రంథములు'**
**అందఱికి - అన్నింటికి**
**నమస్సుమాంజలులు.**

**- రామోరా.**



శ్రీః

# శ్రీవిశ్వేశ్వరీసూక్తమ్

ఓం శ్రీం ఐం హ్రీం స్వాహా

ఓం

శ్లో॥ విశ్వేశ్వరీం జగద్ధాత్రీం స్థితిసంహారకారిణీమ్ ।
నిద్రాం భగవతీం విష్ణో-రతులాం తేజసః ప్రభుః ॥ 1

బ్రహ్మోవాచ

శ్లో॥ త్వం స్వాహా త్వం స్వధా త్వం హి వషట్కారః స్వరాత్మికా ।
సుధా త్వమక్షరే! నిత్యే! త్రిధా-మాత్రాత్మికా-స్థితా ॥ 2

శ్లో॥ అర్ధమాత్రా-స్థితా నిత్యా యాఽనుచ్చార్యా విశేషతః ।
త్వమేవ సంధ్యా సావిత్రీ త్వం దేవి! జననీ పరా ॥ 3

శ్లో॥ త్వయైతద్ధార్యతే విశ్వం త్వయైతత్సృజ్యతే జగత్ ।
త్వయైతత్పాల్యతే దేవి! త్వమత్స్యన్తే చ సర్వదా ॥ 4

శ్లో॥ విసృష్టౌ సృష్టిరూపా త్వం స్థితిరూపా చ పాలనే ।
తథా సంహృతిరూపాఽన్తే జగతోఽస్య జగన్మయే! ॥ 5

శ్లో॥ మహావిద్యా మహామాయా మహామేధా మహాస్మృతిః ।
మహామోహా చ భవతీ మహాదేవీ మహాసురీ ॥ **6**

శ్లో॥ ప్రకృతిస్త్వఞ్చ సర్వస్య గుణత్రయవిభావినీ ।
కాలరాత్రిర్ మహారాత్రిర్ మోహరాత్రిశ్చ దారుణా ॥ **7**

శ్లో॥ త్వం శ్రీస్త్వమీశ్వరీ త్వం హ్రీస్త్వం బుద్ధిర్ బోధలక్షణా ।
లజ్జా పుష్టిస్తథా తుష్టిస్త్వం శాన్తిః క్షాన్తిరేవ చ ॥ **8**

శ్లో॥ ఖడ్గినీ శూలినీ ఘోరా గదినీ చక్రిణీ తథా ।
శంఖినీ చాపినీ బాణ-భుశుండీ-పరిఘాయుధా ॥ **9**

శ్లో॥ సౌమ్యా(ఽ) సౌమ్యతరాఽశేష-సౌమ్యేభ్యస్త్వతిసున్దరీ ।
పరాపరాణాం పరమా త్వమేవ పరమేశ్వరీ ॥ **10**

శ్లో॥ యచ్చ కిఞ్చిత్ క్వచిద్వస్తు సదసద్వాఽఖిలాత్మికే ।
తస్య సర్వస్య యా శక్తిస్సా త్వఙ్కిం స్తూయసే తదా ॥ **11**

శ్లో॥ యయా త్వయా జగత్స్రష్టా జగత్పాత్యత్తి యో జగత్ ।
సోఽపి నిద్రావశం నీతః కస్త్వాం స్తోతుమిహేశ్వరః ॥ **12**

శ్లో॥ విష్ణుశ్శరీరగ్రహణ-మహమీశాన ఏవ చ ।
కారితాస్తే యతోఽతస్త్వాం కస్స్తోతుం శక్తిమాన్భవేత్ ॥ **13**

శ్లో॥ సా త్వమిత్థం ప్రభావైస్ స్వై-రుదారైర్దేవి! సంస్తుతా ।
మోహయైతౌ దురాధర్షావసురౌ మధుకైటభౌ ॥ **14**

శ్లో॥ ప్రబోధఞ్చ జగత్స్వామీ నీయతామచ్యుతో లఘు ।
బోధశ్చ క్రియతామస్య హన్తుమేతౌ మహాసురౌ ॥ **15**

ఓం

శ్రీః

# శ్రీవిశ్వేశ్వరీసూక్తమ్
నామ
# తంత్రోక్తరాత్రిసూక్తమ్

**ఓం శ్రీం ఐం హ్రీం స్వాహా**

**ఓం**

**శ్లో॥ విశ్వేశ్వరీం జగద్ధాత్రీం స్థితిసంహారకారిణీమ్ ।**
**నిద్రాం భగవతీం విష్ణో-రతులాం తేజసః ప్రభుః ॥ 1**

**పదవిభాగం :** విశ్వేశ్వరీమ్, జగద్ధాత్రీమ్, స్థితి-సంహార-కారిణీమ్, నిద్రామ్, భగవతీమ్, విష్ణోః+అతులామ్, తేజసః, ప్రభుః.

**ప్రతిపదార్థం :** విశ్వేశ్వరీమ్ = విశ్వమునకంతటికిని ఈశ్వరియు, జగత్+ధాత్రీమ్ = జగద్ధాత్రీమ్ = జగత్తునకంతటికిని జననియు (భరించునది), లేదా సర్వలోకములను పోషించునదియు, స్థితి-సంహార-కారిణీమ్ = స్థితి, ప్రళయములకు కారణభూతిఐనదియు, భగవతీమ్ = షడ్గుణైశ్వర్యసంపత్తికలిగినదియు, తేజసః విష్ణోః = తేజస్స్వరూపుడగు విష్ణువుయొక్క, అతులామ్ = సాటిలేని శక్తియగు, నిద్రామ్ = నిద్రాదేవి (యోగమాయ) ని గురించి, ప్రభుః = ప్రభువగు, (బ్రహ్మా = బ్రహ్మదేవుడు, ఉవాచ = స్తుతించెను. (పలికెను.)

**తాత్పర్యం :** విశ్వమున కంతటికిని ఈశ్వరియు, జగత్తున కంతటికి జననియు, స్థితి - ప్రళయములకు కారణభూతియు, షడ్గుణైశ్వర్య సంపత్తికలిగినదియు, తేజస్స్వరూపుడగు శ్రీమన్నారాయణుని అప్రతిమాన శక్తియగు యోగమాయయైన నిద్రాదేవిని (ప్రభువగు బ్రహ్మదేవుడు స్తుతించెను.)

**విశేషాంశములు :** 1. విశ్వేశ్వరీమ్, జగద్ధాత్రీమ్, స్థితిసంహారకారిణీమ్, భగవతీమ్, నిద్రామ్, అతులామ్ - ఇవి ద్వితీయావిభక్తి - ఏకవచనరూపాలు.

2. **విశ్వేశ్వరీమ్.** అ) విశ్వస్య ఈశ్వరీం వ్యాపికాం జనయిత్రీమ్

ఆ) శ్రీమదప్పయ్య దీక్షిత విరచితమైన 'దేవీచంద్రాకలాస్తుతిః' - (ప్రథమశ్లోకము),

చండీసప్తశతిప్రథమచరిత్రను సంగ్రహంగా పేర్కొనబడిన దానిని, ఇట అనుసంధానము చేసికొనదగును.

శ్లో॥ అభ్యర్థనేన సరసీరుహసమ్భవస్య
త్యక్త్వోదితా భగవదక్షిపిధానలీలామ్ ।
**విశ్వేశ్వరీ** విపదపాగమనే పురస్తా-
న్మాతా మమాస్తు మధుకైటభయోర్నిహన్త్రీ ॥ 1

శ్లో॥ విశ్వేశ్వరీతి మహిషాన్తకరీతి యస్యా
నారాయణీత్యపి చ నామభిరఙ్కితాని ।
సూక్తాని పఙ్కజభువా చ సురర్షిభిశ్చ
దృష్టాని పావకముఖైశ్చ **శివాం** భజే తామ్ ॥ 5

3. జగద్ధాత్రీమ్ – అ) జగతాం ధాత్రీం సృష్టికర్త్రీమ్ – జగన్నిర్మాణశక్తిగలదియును

ఆ) ధాత్రీ జనన్యామలకీవసుమత్యుపమాతృష్వితి మేదినీకోశః ।

ఇ) ధాత్రీ – స్త్రీ. ధీయతే పీయతే ఇతి । ధేట్ పానే + '**సర్వధాతుభ్యఃష్ట్రన్**' ఇతి కర్మణి 'ష్ట్రన్' । షిత్వాద్ జీష్ । స్తనదుగ్ధపానాత్తథాత్వమ్ । యద్వా దధాతి ధరతీతి. ధా+తృచ్+జీప్ । దధాతి ధారయతి సర్వమితి। – అని హలాయుధకోశం పేర్కొన్నది.

ఈ) '**ధాత్రీ** ధనుర్ధరా ధేనుర్ధారిణీ ధర్మచారిణీ' – ఇతి దేవీభాగవతే 12-6-79

ఉ) **జగద్ధాత్రీమ్** – 1. చతుర్దశభువనములను ధరించునదియును

2. 'ఈ నింగి నేలల కెలఁగాణాచి
పోసనాలిప్పించి ప్రోచెడి తల్లి
ఆస్తికి దావలం బాగట్టుపట్టి
కొలిచెడి వారల కన్నట్టుఁగొమ్మ'. తల్లివిన్కి (935)

ఊ) జగత్ = సకల భువనోపేతమగు బ్రహ్మాండమును, ధాత్రీమ్ – ధరించి యుండు నదియును.

ఋ) 'యస్మాద్ధారయతే లోకాన్ వృత్తిమేషాం దదాతి చ డుధాఞ్ ధారణే ధాతుః జగద్ధాత్రీ మతా బుధైః' ఇతి దేవీ పురాణే. – సౌభాగ్యభాస్కరభాష్యమ్ (935)

4. **భగవతీ : స్త్రీ. భగః**

'ఐశ్వరస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః ।
జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా ॥

ఇత్యుక్తలక్షణం షడైశ్వర్యమస్త్యస్యా ఇతి ।

అ) శ్లో॥ 'సా మాం పాతు సరస్వతీ **భగవతీ** నిశ్శేషజాడ్యాపహా' – ఇతి పౌరాణికాః ।

ఆ) శ్లో॥ 'జ్ఞానినామపి చేతాంసి దేవీ **భగవతీ** హి సా ।
బలదాకృష్య మోహాయ మహామాయా ప్రయచ్ఛతి ॥ ' ఇతి మార్కండేయే (91–42)
'సా చ ప్రకృతి రూపిణీ మాయాదేవీ'

ఇ) భగవతీం షడైశ్వర్యసంగతామ్ ।

ఈ) **భగవతీ** (280) – ఐశ్వర్యము, ధర్మము, యశస్సు, కీర్తి, లక్ష్మి, జ్ఞానము, యుక్తాయుక్త వివేకము, విజ్ఞానము, బ్రహ్మజ్ఞానము మొ॥ సుగుణాలను పాలించునది.

తన బోడికకు గొప్పతనమిచ్చు తల్లి
పుట్టుక, పొదలిక, పోకడ, రాక
యెఱుకువ మఱకువ లేలెదు వేల్పు. – తల్లివిన్కి.

ఉ) **భగవతీ** (279) –

1. శ్లో॥ 'భగమైశ్వర్యమాహాత్మ్యజ్ఞానవైరాగ్యయోనిషు ।
యశోవీర్యప్రయత్నేచ్ఛా ధర్మశ్రీరవిముక్తిషు ॥ ఇతి

కోశే చ ప్రసిద్ధా భగపదార్థా అస్యాం సంతీతి **భగవతీతి** ।

2. శ్లో॥ 'ఉత్పత్తిం ప్రలయం చైవ – భూతానాం గతిమాగతమ్ ।
అవిద్యావిద్యయోస్తత్త్వం వేత్తీతి **భగవత్యసా** ॥ ఇతి దేవీభాగవతే.

3. శ్లో॥ పూజ్యతే యా సురైస్సర్వైః – తాంశ్చైవ భజతే యతః ।
సేవాయాం భజతిర్ధాతు – **ర్భగవత్యే**వ సా స్మృతా ॥ ఇతి శక్తిరహస్యే.

– అని సౌభాగ్యభాస్కరభాష్యం పేర్కొన్నది.

4. శ్లో॥ ఐశ్వర్యం శంకరాదీశ్వరవినియమనం విశ్వతేజోహరాణాం
తేజస్సంహారి వీర్యం విమలమపి యశో నిస్పృహైశ్చోపగీతమ్ ।
అంగాసంగా సదా శ్రీరఖిలవిదసి న క్వాపి తే సంగవార్తా
తద్వాతాగారవాసిన్! మురహర! భగవచ్ఛబ్దముఖ్యాశ్రయోఽసి ॥

– శ్రీమన్నారాయణీయమ్ 1-10

అంటూ 'భగవత్' శబ్దాన్ని నిర్వచించింది.

5. '**స్తౌమి నిద్రాం భగవతీం విష్ణోరతులతేజసః**' - అని శ్లోకమున ఉత్తరార్ధమునకు పాఠాంతరము చెప్పబడినది.



**బ్రహ్మోవాచ :**

**శ్లో॥ త్వం స్వాహా త్వం స్వధా త్వం హి వషట్కారః స్వరాత్మికా ।**
**సుధా త్వమక్షరే! నిత్యే! త్రిధా-మాత్రాత్మికా-స్థితా ॥ 2**

**ప.వి. :** త్వమ్, స్వాహా, త్వమ్, స్వధా, త్వమ్, హి, వషట్కారః, స్వరాత్మికా, సుధా, త్వమ్, అక్షరే!, నిత్యే!, త్రిధా-మాత్రాత్మికా-స్థితా ।

**ప్ర :** (హే నిద్రే భగవతి! = ఓ నిద్రా భగవతీ!), హే అక్షరే! = ఓ అక్షరస్వరూపిణీ!, హే నిత్యే! = ఓ నిత్యాదేవీ!, త్వమ్ = నీవు, స్వాహా = దేవతలకిచ్చు హవ్య స్వరూపిణివి, త్వమ్ = నీవు, స్వధా = పితృదేవతలకిచ్చు కవ్య స్వరూపిణివి, త్వమ్ = నీవు, వషట్కారః = వషట్ ఇత్యాది మంత్రములతో కూడిన యజ్ఞస్వరూపిణివి. త్వమ్ = నీవు, స్వరాత్మికా = వేదార్థబోధకములగు ఉదాత్త, అనుదాత్త, స్వరితములను వేదస్వరముల స్వరూపిణివి, త్వమ్ = నీవు, సుధా = అమృతస్వరూపిణివి, త్వమ్ = నీవు, త్రిధా-మాత్రాత్మికా-స్థితా = అ) అకార - ఉకార - మకార సమష్టివగు ఓంకారస్వరూపిణివి. ఆ) బ్రహ్మ - విష్ణు - మహేశ్వరుల శక్తులగు వామా - జ్యేష్ఠా - రౌద్రీల సమష్టి స్వరూపిణివి.

**తా :** ఓ అక్షరస్వరూపిణీ! ఓ నిత్యాదేవీ! నీవు దేవతలకిచ్చు హవ్య స్వరూపిణివి. నీవు పితృదేవతలకిచ్చు కవ్యస్వరూపిణివి. నీవు వషట్ ఇత్యాది మంత్రములతో కూడిన యజ్ఞస్వరూపిణివి. నీవు వేదార్థబోధకములగు ఉదాత్త - అనుదాత్త - స్వరితములను వేదస్వరముల స్వరూపిణివి. నీవు అ) అకార - ఉకార - మకార సమష్టివగు ఓంకారరూపిణివి, ఆ) బ్రహ్మ - విష్ణు - మహేశ్వరుల శక్తులగు వామా - జ్యేష్ఠా - రౌద్రీ సమష్టి స్వరూపిణివైన **శాంతవు,** ఇ) హ్రస్వ - దీర్ఘ - ప్లుత సమష్టిరూపిణివి.

**వి :** 1. **త్వమ్** అ) తుభ్యం నమః, యుష్మచ్ఛబ్దవాచ్యురాలు.

ఆ) '**నీవనునుడి వాసి నెగడిన వేల్పు**' - అంటుంది **తల్లివిన్కి -** శ్రీమదాదిభట్లనారాయణదాసు గారు.

**ఇ)** శ్రీలలితారహస్యసహస్రనామస్తోత్రమ్ - సౌభాగ్యభాస్కరభాష్యమ్ 426 నామ వ్యాఖ్యానమును ఇట అనుసంధానము చేసికొనదగును.

2. **స్వాహా - స్త్రీ.** సుష్ఠు ఆహూయన్తే దేవా అనయేతి 1. సు+ఆ+హ్వే+డా।

శ్లో॥ స్వేతి స్వర్గే స్వేతి చాత్మా న ముక్తా
హేత్యాహేతి హేతి విద్యాద్గతిం చ ।
స్వర్గాత్మా చ స్వాత్మనా సామశాఖా
వహ్నేర్జాయా హూయతే యత్ర సర్వమ్ । ఇతి ప్రపంచసారే.

అ) శ్లో॥ '**స్వాహా** దేవహవిర్దానే ప్రశస్తా సర్వకర్మసు ।
పిండదానే **స్వధా** శస్తా దక్షిణా సర్వతో వరా ॥ '

ఆ) శ్లో॥ ఓం హ్రీం శ్రీం వహ్నిజాతాయై దేవ్యై **స్వాహేత్య**నేన చ ।
యః పూజయేచ్చ తాం దేవీం సర్వేష్టం లభతే ధ్రువమ్ ॥ – ఇతి బ్రహ్మవైవర్తే.

ఇ) మొదటి మాసమునందు గర్భస్వభావమును సూచించు నామవిశేషం.

ఈ) **స్వాహా** – దేవతలను పోషించు 'స్వాహా' దేవి స్వరూపిణి.

'వినుద్రిమ్మరుల పిల్పు వెలితిప్పటెంకి
నిప్పునిల్వేసామి నిన్గన్న తల్లి
వేల్పుల న్వరవుచే వేడించు జేజే" – తల్లివిన్కి (535)

ఉ) అనయోరవ్యయత్వాత్ '**స్వాహా** నమః', '**స్వధా** నమః' ఇతి ప్రయోగః.
– సౌభాగ్యభాస్కరభాష్యమ్.

ఊ) '**స్వాహా** మహేశ్వరే పురే' ఇతి పాద్మాత్ ।

'**స్వాహా**దేవి మాహేశ్వరీ పీఠమునకు అధిష్ఠానదేవత' యని పద్మపురాణము పేర్కొన్నది.

...'స్వాహా పోషయ పోషయ...' ఇతి దత్తాత్రేయమాలామంత్రః ।

3. **స్వధా :–** అ) సుష్ఠు అధీయతే అనయేతి వా । సుష్ఠు అం విష్ణుం స్వాన్ వా దధాతి పోషయతీతి **స్వధా.**

శ్లో॥ యస్యాస్సమస్తసురతా సముదీరణేన
తృప్తిం ప్రయాన్తి సకలేషు మఖేషు దేవి! ।
స్వాహాసి వై పితృగణస్య చ తృప్తి హేతు–
రుచ్చార్యసే త్వమత ఏవ జనైస్స్వ**ధా** చ। ఇతి సప్తశత్యాం.

ఆ) గర్భమునకు రెండవమాసము నందలి సంకేతము. – శ్రీకల.

ఇ) పితృదేవతలను పోషించు **స్వధా** స్వరూపిణి.

ఈ) 'ఏడుడివేల్మిపిల్పే గట్టుపట్టి
పెతరుల నడియలు పేర్కొను నుడువు' – తల్లివిన్కి (536)

4. **వషట్కారః :** అ) ఓం వషట్కారాయ నమః.

ఆ)శ్లో॥ విశ్వం విష్ణు**ర్వషట్కారో** భూతభవ్యభవత్ప్రభుః ।
భూతకృత్ భూతభృద్భావో భూతాత్మా భూతభావనః ॥ – శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రమ్.

ఇ) శ్రీపరాశరభట్టర్ వారి భాష్యం :

'ఆకాశాది వైలక్షణ్యేన ఏతద్వ్యాప్తేః ప్రయోజనముచ్యతే. వషట్కారః – సర్వం వశం – స్వేచ్ఛానువర్తి కరోతీతి – కరోతేః కర్మణ్యణ్. 'వశ–కాన్తౌ' ఇత్యస్మాద్ ధాతోః, '(ప్రచ్ఛ) దంసీ' ఇతి, అత్ర బాహుళకానువృత్తేః అట్ ప్రత్యయః, వశేః షాదేశశ్చ – 'సర్వస్య వశీ సర్వస్యేశానః'; 'జగద్వశే వర్తతేదమ్' ఇతి.

**'వషట్'** అనగా సర్వమును తనవశమై యుండునట్లు – తన ఇచ్ఛానుసారము ప్రవర్తించునట్లు – 'కరోతి' చేయుచున్నాడు, గనుక **వషట్కారః** అని ఈ నామమునకు నిర్వచనము. పుంలింగరూపమిది.

ఈ) 1. వాక్ వై వషట్కారః । వాగ్రేతః । రేత ఏవ ఏతత్ సిఞ్చతి'

2. షట్ ఇతి । ఋతవో వై షట్, తద్ ఋతుష్వేవ ఏతత్ రేతః సిచ్యతి తదృతవ రేతః । సిక్తమిమాః ప్రజాః ప్రజనయన్తి । తస్మాదేవ వషట్ కరోతి ।. – వైదికకోశః ।

3. 'యజ్యాభి**ర్వషట్కారాన్**' – వాజసనేయసంహితా – 19.20

5. యోగమాయ యైన 'నిద్రాదేవి' ఇట పుంరూపిణిగా చెప్పబడినది.

6. శ్లో॥ .... వషఙ్వశీకురు వౌషడాకర్షయ ।
హుం విద్వేషయ ఫడుచ్చాటయ... ॥ – 54 శ్రీదత్తపురాణమ్. ద్వితీయాష్టకం –8 అ

5. **స్వరాత్మికా** – వేదస్వరముల సమష్టిరూపిణి.

అ) ఉదాత్తము – **ఉచ్చైరుదాత్తః** (సూ. 1–2–29) తాల్వాదిస్థానములలో (దౌడ, కంఠము మున్నగు వర్ణోద్భవస్థానములలో) ఊర్ధ్వభాగమున నిష్పన్నమైన అచ్చు **ఉదాత్తము** అని చెప్పబడును. ఉదా :– ఆ యే.

ఆ) అనుదాత్తము – **నీచైరనుదాత్తః** (సూ. 1–2–30) తాల్వాదిస్థానములలో క్రింది భాగమున నిష్పన్నమైన అచ్చు **అనుదాత్తము** అని చెప్పబడును. ఉదా : **అ** ర్వాజ్

ఇ) స్వరితము – **సమాహారః స్వరితః** (సూ. 1–2–31) ఉదాత్తానుదాత్త వర్ణధర్మములు కలిపి ఉచ్చరింపబడిన అచ్చు **స్వరిత**మని చెప్పబడును. ఉదా : **క్వవో౽శ్వాః** రథా**నాం** నయేరాః శతచక్రం యోహ్యః ।

6. **సుధా –** స్త్రీ. అ) సుఖేన ధీయతే పీయతే ఇతి। సు+ధేట్ పానే+'ఆతశ్చోపసర్గే' ఇత్యఙ్, టాప్ । అమృతం, పీయూషం, పేయూషం, త్రిదశాహారః ।

ఆ)శ్లో॥ 'న పశ్చాత్తే౽పి మన్యన్తే సుధామపి సురోపమామ్'... ఇతి రామాయణే 2–61–13)

ఇ) 'ఈ లోకమునందే భగవంతుని అంబికను **శిశువుగా భావించి** ఆరాధించి కోప–కామ–దుఃఖాదులను పోగొట్టుకోవాలి. దేవిని **శిశుభావనతో పూజిస్తే** మనకున్ను **శిశుభావం వస్తుంది**. ఆమె అప్పుడే **సాక్షాత్కరిస్తుంది**. దానికే '**అమృతం**'అని పేరు. ఆస్థితి కలగడానికి ఆమె అనుగ్రహం ఉండాలి. "మంచిజ్ఞానమే అమృతం. కన్నతల్లులు దేహానికి పుష్టికలిగించే పాలిస్తారు. శ్రీమాత లోకజనని. ఆత్మకు పుష్టి కలిగించే జ్ఞానక్షీరం ఇస్తుంది.

– శ్రీశ్రీశ్రీచంద్రశేఖరేంద్రసరస్వతీస్వామి వారు.

7. **అక్షరే! –** అ) అక్షరా – ఆకారంత స్త్రీలింగరూపము. అక్షరే! – సంబుద్ధ్యంతము. వైదిక ప్రయోగమిది. ఓ ధ్వని స్వరూపిణీ లేదా ఓ **నాదస్వరూపిణీ** అని ఇట చెప్పదగును. (శబ్దబ్రహ్మస్వరూపిణీ! వర్ణరూపిణీ!)

ఆ) శ్లో॥ ఆధారోత్థితనాదో....

గుణ ఇవ పరిభాతి వర్ణమధ్యగతః ।

మూలాధారమునందు ఉత్పన్నమగుచు, అటనుండి పైకిలేచి, వ్యాపించుచు పోవు నాదము శ్రీవిద్యా౽వయవములగు వర్ణముల నడుమ చేరియున్నదగుచు దారమువలె అంతట ప్రకాశించుచున్నది. మిగిలిన వివరములకు **8వ శ్లోక వ్యాఖ్యానము** చూడగలరు.

* ఇట భాస్కరాచార్యుల వారందించిన '**వరివస్యాగ్రంథము**'నుండి '**అకథా**' చక్రమును అనుసంధానము తప్పక చేసికొనగలరు. '**నాదము**'ను దిగువ చిత్రము ద్వారా గ్రహింతురు. నాదస్వరూపమును కూడ గ్రహించండి. అస్తు.

| बिन्दु | अर्द्धचन्द्र | रोधिनी | नाद | नादान्त | शक्ति | व्यापिका | समना | उन्मना |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | | | |

* '**అక్షర**' స్వరూపమునకై '**మాతృకాచక్రవివేకం**' చూడప్రార్థన.

8. **త్రిధా-మాత్రాత్మికా-స్థితా :** అ) హ్రస్వ – దీర్ఘ – ప్లుత సమష్టిరూపిణివి.

ఆ) ఊకాలోఽజ్ఝ్రస్వదీర్ఘప్లుతః (సూ 1-2-27)

ఒక్క చిటిక కాలములో ఉచ్చరింపబడు అచ్చు **హ్రస్వము** (అ,ఇ,ఉ,ఋ,ఌ). రెండు చిటికల కాలములో ఉచ్చరింపబడు అచ్చు దీర్ఘము (ఆ,ఈ,ఊ,ౠ,ఏ,ఐ,ఓ,ఔ). మూడు చిటికల కాలములో ఉచ్చరింపబడు అచ్చు ప్లుతము (అ$^3$,ఇ$^3$,ఉ$^3$,ఋ$^3$,ఌ$^3$,ఏ$^3$,ఐ$^3$,ఓ$^3$,ఔ$^3$) ఉదయకాలమున కోడి తన కూతలో హ్రస్వ – దీర్ఘ – ప్లుతములను చూపును.

2. త్ర్యక్షరివి, వాక్, కామ, శక్తి బీజస్వరూపిణివి. । ఐం – క్లీం – హ్రీం ।

**శ్లో॥ అర్ధమాత్రా-స్థితా నిత్యా యాఽనుచ్చార్యా విశేషతః ।**
**త్వమేవ సంధ్యా సావిత్రీ త్వం దేవి! జననీ పరా ॥ 3**

**ప.వి. :** అర్ధమాత్రా-స్థితా, నిత్యా, యా, అనుచ్చార్యా, విశేషతః, త్వమ్, ఏవ, సన్ధ్యా, సావిత్రీ, త్వమ్, దేవి!, జననీ, పరా ।

**ప్ర :** (హే నిత్యే! = ఓ సత్యస్వరూపిణీ!; శాశ్వతీ!), దేవి! = ఓ దేవీ!, త్వమ్ = నీవు, నిత్యా = సత్యస్వరూపిణివి, శాశ్వతవు, అర్ధమాత్రాస్థితా = అపరిణామశీలవు, తురీయ స్వరూపిణివి, విశేషతః = మీదుమిక్కిలి, యాఽనుచ్చార్యా = ఉచ్చరించుటకు సాధ్యముకాని తురీయాతీతవు, త్వమేవ = నీవే, సంధ్యా = సంధ్యవు, సావిత్రీ = సవితృదేవతవు, త్వమ్ = నీవు, పరా = పరమైన, జననీ = జననివి.

**తా :** (ఓ సత్యస్వరూపిణీ!) ఓ దేవీ! నీవు శాశ్వతవు, అపరిణామశీలవు, తురీయస్వరూపిణివి, మీదుమిక్కిలి ఉచ్చరించుటకు సాధ్యముకాని తురీయాతీతవు. సంధ్యాస్వరూపిణివున్నూ నీవే. సవితృదేవతవు. లోకములన్నింటికి గొప్ప జననివి నీవే గదా!

**వి : 'అనుచ్చార్యా – అర్ధచంద్రరోధిన్యాదిధ్వన్యష్టకరూపా'.** తత్స్వరూపం చ యోగినీహృదయ వ్యాఖ్యాయాం ద్రష్టవ్యమ్.

2. **అర్ధమాత్రాస్థితా –**

శ్లో॥ 'ఏకమాత్రో భవేద్ హ్రస్వో – ద్విమాత్రో దీర్ఘ ఉచ్యతే ।
త్రిమాత్రస్తు ప్లుతో జ్ఞేయో – వ్యంజనం త్వర్ధమాత్రకమ్ ॥

వ్యంజనము (హల్లు) (క్ఖ్గ్ఘ్ఙ్....) అర్ధమాత్రాకాలమును తమ తమ ఉచ్చారణమునకై కలవి యగును.

మరిన్ని వివరములకు '**వరివస్యారహస్యము**' చూడదగును.

3. **విశేషతః** – అ) అవ్యయము, మీదుమిక్కిలి, పైపెచ్చు, మరియున్నూ. ఆ) విశేష+తసి

4. **సంధ్యా** – అ) జగద్గురు శ్రీకల్యాణానందభారతీమాన్తాచార్యస్వామివారి '**సంధ్యాకళా**'ను ఇట అనుసంధానము చేసుకొనదగును.

ఆ) స్త్రీ. అ) సమ్ సమ్యక్ ధ్యాయత్యస్యామితి 1. సమ్+ధ్యై చింతాయామ్ + 'ఆతశ్చోపసర్గే' ఇతి అఙ్ । యద్వా సందధాతీతి । సమ్+ధా+ 'అధ్న్యాదయశ్చ' ఇతి యక్ ప్రయత్నేన నిపాతితః । కాలవిశేషణః । దివారాత్రి సంబంధి దండద్వయరూపః. – ఇతి హలాయుధకోశే.

ఇ) శ్లో॥ సర్వావస్థోఽపి యో విప్రః – సంధ్యోపాసనతత్పరః ।
స చ సూర్యసమో సదా' .... ॥ ఇతి కౌర్మే ।

ఈ) 'సన్ధ్యాం ప్రాక్ ప్రాతరేవం హి తిష్ఠేదాసూర్యదర్శనాత్' – యా. స్మృతిః.

అహోరాత్రుల సంధియందు చేయవలెనని విధింపబడిన క్రియ **సంధ్య**. సూర్యమండలం పూర్తిగా కనబడే కాలం **పగలు.** అందుకు విపరీతమైనది **రాత్రి.** సూర్యమండలం సగం కనబడే సమయం **సంధి.**

ఉ) **సంధ్యా** (423) – అ) అహోరాత్రాల సంధికాలమునందు ఉపాసింపతగిన దేవత.

పురటవేల్పుడున కుప్పొంగెడు వేల్పు
మీఁదుక్రిందులతుకు మెట్టాఁడుపడుచు
అన్నిపనుల నంటియంటని **జేజ**
వంచయేడీడు చెల్వమలరుపాప ॥ – **తల్లివిన్కి.**

ఊ) **సంధ్యా** తథాహ శ్రీక్రోధభట్టారకః –

శ్లో॥ గాయత్రీ సశిరాస్తురీయసహితా **సంధ్యా**మయీ త్యాగమైః ।
ఆఖ్యాతా త్రిపురే **త్వ**మేవ మహతాం శర్మప్రదా కర్మిణామ్ ॥

– జయమంగళవ్యాఖ్యా

ఋ) **సంధ్యా**స్థానమనగా అంతఃకరణవిశేషమగు మనోమయకోశము. అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయకోశములనెడి ఐదుకోశములకును **మనోమయము** మధ్యకోశమగుటచే **సంధ్య**యను శబ్దము మనోమయకోశమునకు లాక్షణికము. అనగా సంధ్య యన మనోమయకోశమని అర్థము. మనోమయకోశమన్ననో ఐదు అవయవములతో కూడియున్నదనియు, అట్టి అవయవములు వేదరూపములే యనియు రహస్యము. మనోమయకోశపు శిరస్సు –యజుర్వేదము, దక్షిణపక్షము – ఋగ్వేదము, ఉత్తరపక్షము

– సామవేదము, పుచ్ఛము – అథర్వణవేదము, **ఆదేశమనెడి బ్రాహ్మణములు** మధ్యమమగు **నాత్మ.** –శ్రీకల.

ఋా) 'సంధ్యేతి సూర్యగం బ్రహ్మ సంధానాదవిభాగతః బ్రహ్మాద్యైస్సకలైర్భూతైః తదంశై–స్సచ్చిదాత్మనః తస్య దాసోఽహమస్మీతి సోఽహమస్మీతి యా మతిః భవేదుపాసకస్యేతి హ్యేవం వేదవిదో విదుః ' – ఇతి సౌభాగ్యభాస్కరభాష్యే.

సూర్యుని యందలి చైతన్యమును బ్రహ్మాదులతోను, మహాభూతములతోను వాని అంశములతోను అభేదముగా అనుసంధానము గావించుట వలన మొదట సచ్చిదానందరూప పరమాత్మకు నేను దాసుడనెడు బుద్ధి ఉపాసకునకు కలుగును. ఆ పిమ్మట **నేనే** ఆ పరమాత్మ అనెడు బుద్ధి కలుగును. అట్టి అభేదభావనకు '**సంధ్యా**' అని పేరు.

5. '**సావిత్రీ**' – అ) ఇట శ్రీఅరవిందుల వారి '**సావిత్రి**' గ్రంథమును అనుసంధానము గావింతురు గాక.

ఆ) **సావిత్రీ** (699) – అ) సవితా అను నామము కల శివునకు పత్ని

'నింగినేలలకుఁదానే కన్నతల్లి
తమ్ముల విందునందలి నిగ్గు మొగ్గ
ముగిత మేలుతరము ముక్కంటి రాణి
అడియని కెఱుకువ నలరించు వేల్పు '. – **తల్లివిన్కి**

ఇ) షూజ్ ప్రాణప్రసవే ఇతి ధాతోః కర్తరి తృచ్ ఋన్నేభ్యః. ఇతి ఙీప్. యదాహుర్నైరుక్తాః – సవితా ప్రసవితేతి । సవితృమండలాధిష్ఠాతృదేవతాత్వాద్వా తథా తాం పరాం దేవతా మాకలయతి । – జయమంగలవ్యాఖ్యా.

శ్లో॥ త్రిదశైరర్చితా దేవీ వేదయోగేషు పూజితా ।
భావశుద్ధస్వరూపా చ **సావిత్రీ** తేన సా స్మృతా ॥ – ఇతి దేవీపురాణే.

ఈ) శ్రీలలితాసహస్రనామస్తోత్రమున అన్నదా (700) నుండి సచ్చిదానందరూపిణీ (733) నామము వఱకు గల **34** నామములచే **సావిత్రీవిద్య** యుపదేశింపబడినదని గ్రహింతురుగాక.

ఉ) ఇదియొక రహస్యనామము. సవితృదేవతాకమైన తేజస్సుతో ననగా సూర్యతేజస్సుతో ప్రకాశించునది యని యర్థము. ఈ నామము యొక్క అర్థమే **సచ్చిదానందరూపిణీ** యనునది. – శ్రీకల.

6. **జననీ** – స్త్రీ. అ) జనయతీతి । జని+బాహులకాదని, కృదికారాదితి వా ఙీష్। యద్వా '**కృత్యల్యుటో బహులమితి**' ల్యుట్, టిత్వాత్ ఙీప్ । మాతా

శ్లో॥ నిరతిశయం గరిమాణం తేన జనన్యాః స్మరన్తి విద్వాంసః ।
యత్ కమపి వహతి గర్భం మహతామపి యో గురుర్భవతి ॥
– ఇతి పంచతంత్రే 1-36

ఆ) **జననీ** (823) – అ) సకల ప్రపంచమును సృష్టించునది.

'నింగి నేలలకుఁదానే కన్నతల్లి
అంతయున్గలిగించు నాగట్టుపట్టి
బోడికకున్మేలె పొసగించువేల్పు'. – **తల్లివిన్కి.**

ఆ) **'సర్వప్రపంచస్య ఉత్పాదకత్వాజ్జననీ'.** – సర్వప్రపంచమునకు ఉత్పాదకమైనది కాన **జననీ** అయినది. సౌభాగ్యభాస్కరభాష్యే. ఇక్కడ **బ్రహ్మజననీ**అను రెండు నామములను ఏకనామము చేసిన బాగుండును. **బ** కారాది నామములమధ్య **జ** కారాది నామముంచుట న్యాయము కాదని కొందఱి భావన. **బ** కారాది నామమున్నచో స్వారస్యమని తెలియదగును.

బ్రహ్మ (822) – జననీ (823) – బహురూపా (824)

బ్రహ్మజననీ – బహురూపా

7. **నిత్యా** – అ) 'శ్రీదేవిఖడ్గమాలా' –ను అధ్యయనము గావింతురుగాక.

ఆ) **'అవినాశీ వా అరేఽయమాత్మా'** ఇతి శ్రుతేః, తిథినిత్యా, మంత్రరూపా వా ।

ఇ) **నిత్యా** (137) – 1. సర్వకాలసర్వావస్థలలో సృష్టినాశనములు లేకుండా నిత్యముగా వుండునది.

'పగడములాగె యప్పసమొప్పు వేల్పు
అడియరిన్వాలాయ మలరించు జేజె ॥ – **తల్లివిన్కి.**

ఈ)శ్లో॥ 'దేహీ నిత్యమవధ్యోఽయం దేహే సర్వస్య భారత! ' – భ.గీ. 2-30

ఓ అర్జునా! ప్రతివానియొక్క దేహమందున్న ఈ ఆత్మ ఎప్పటికిని చంపబడదు.

ఉ) భూత – భవిష్య – ద్వర్తమానకాలములందు నెట్టిమార్పునులేక స్థిరముగా ఉండునది.
– శ్రీకల.

8. **పరా** (366) – అ) పరేత్యాదినా **'సా కాష్ఠా సా పరాగతిః'** ఇతి శ్రుతేః । పరా సర్వోత్తమేత్యర్థః । తస్యాః స్వరూపమాహ । – జయమంగళవ్యాఖ్యా.

ఆ) **పరా** (367) – మూలాధారమునుండి పుట్టునది. ఇతరములకంటె గొప్పది అయినది.

'అన్ని దిన్సుల వెలుపల నలరు తెలివి
బొడ్డులోన నాపయిడెందమున మెడయెడc
బలుతెఱంగుల వెల్వడు పల్కు నిల్వు
వరవులన్వాయిగాc బలికించువేల్పు ॥ – **తల్లివిన్కి**.

ఇ) **పరా** (380) – వాక్కుయొక్క నిర్వికారమగు నవ్యాకృత స్వరూపమునకు **పరా** యని సంకేతము. ఇయ్యది కారణరూపము. – శ్రీకల.

ఈ) 'పరా' – మరిన్ని వివరములను 'శ్రీవరివస్యారహస్యము' నుండి గ్రహింతురు గాక.

**'పరా** – పశ్యంతీ – మధ్యమా – వైఖరీ'



**శ్లో॥ త్వయైతద్ధార్యతే విశ్వం త్వయైతత్సృజ్యతే జగత్ ।**
**త్వయైతత్పాల్యతే దేవి! త్వమత్స్యన్తే చ సర్వదా ॥** 4

**ప.వి. :** త్వయా, ఏతత్, ధార్యతే, విశ్వమ్, త్వయా, ఏతత్, సృజ్యతే, జగత్, త్వయా, ఏతత్, పాల్యతే, దేవి!, త్వమ్, అత్సి, అన్తే, చ, సర్వదా.

**ప్ర :** (హే భువనేశ్వరి!), దేవి! = ఓ తల్లీ!, ఏతత్ విశ్వమ్ = ఈ విశ్వము, త్వయా = నీచే, ధార్యతే = ధరించబడుచున్నది, ఏతత్ జగత్ = ఈ జగత్తు, త్వయా = నీచే, సృజ్యతే = సృజింపబడుచున్నది, ఏతత్ = ఇదంతయు, త్వయా = నీచే, పాల్యతే = పోషింపబడుచున్నది, చ = మఱియు, సర్వదా = ఎల్లప్పుడు, త్వమ్ = నీవు, అంతే = ప్రలయకాలమునందు, అత్సి = హరించివేయుచున్నావు.

**తా :** (హే భువనేశ్వరి!) ఈ విశ్వమంతయు నీచే ధరింపబడుచున్నది. ఈ జగత్తంతయు నీచేత సృజించ బడుచున్నది. మఱియు పోషింప బడుచున్నది. ఇంకా ప్రలయకాలమునందు నీవు దీనినే హరించివేయుచున్నావు.

**వి :** 1. ధార్యతే, సృజ్యతే, పాల్యతే, అత్సి – ఇవి క్రియరూపపదములు.

2. సృజ (జృజ్) విసర్గే (విడుచుట) సకర్మకమ్, అనిట్, ఆత్మనేపదీ.

**సృజ్యతే** – సృజ్యేతే – సృజ్యన్తే.

3. **విశ్వమ్** –

అ) శ్లో॥ **విశ్వం** విష్ణుర్వషట్కారో భూతభవ్యభవత్ప్రభుః ।
భూతకృద్భూతభృద్భావో భూతాత్మా భూతభావనః ॥ 1

– శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రమ్.

ఆ) శ్రీపరాశరభట్టర్ వారి భాష్యము –

తత్ర పూర్వమ్ సర్వతోముఖం భగవతః పూర్ణత్వమాహ (విశ్వమ్) ఇతి. విశత్యవయవానిత్యర్థే, '**అశూ ప్రుషి లటి కణి ఖటి విశిభ్యః క్వన్**' ఇతి క్వన్ ప్రత్యయః యథా మోక్షధర్మే సంయమాయ పంచశిఖః –

*శ్లో॥ వేశనాద్విశ్వమిత్యాహుర్లోకానాం కాశిసత్తమ! ।*
*లోకాంశ్చ* ***విశ్వమేవేతి*** *ప్రవదన్తి నరాధిప! ॥"* ఇతి...

భగవంతునియొక్క సర్వతోముఖమైన పూర్ణత్వము '**విశ్వమ్**' అను నామముచే వివరింపబడుచున్నది. **తన అవయవములైన సర్వపదార్థములలో ప్రవేశించి యుండువాడు** అను అర్థమునందు 'విశ' అను సంస్కృతధాతువుపై అశూ, లటి, కణి, ఖటి, విశిభ్యః, క్వన్ అను వ్యాకరణ సూత్రముచే క్వన్ అను ప్రత్యయము చేరగా ఈ 'విశ్వ' పదము సిద్ధించినది.

ఈ అర్థమును **మోక్షధర్మ** గ్రంథమున సంయముడు అను రాజునకు పంచశిఖముని బోధించినట్లు 'వేశనా... నరాధిప' అను పై శ్లోకము తెలుపుచున్నది.

భగవానుడు అపరిచ్ఛిన్న మహావిభూతి కలవాడని సంగ్రహముగా ఈ నామముచే ప్రస్తావించబడినది. **ఓం విశ్వాయ నమః.**

ఇ) అ) **విశ్వః** । త్రి. । విశ్+క్వన్ । సకలం, సర్వం, సమగ్రం, సమస్తం, కృత్స్నం, నిఖిలమ్, అఖిలమ్ ।

శ్లో॥ యస్తు **విశ్వస్య** జగతో బుద్ధిమాక్రమ్య తిష్ఠతి ।
తం ప్రాహురధ్యాత్మవిదో విశ్వజిన్నామ పావకమ్ ॥

– ఇతి మహాభారతే 3-219-16

ఆ) **క్లీ** । విశతి స్వకారణమితి । విశ్ ప్రవేశనే+క్వన్+జగత్, సంసారః ।

శ్లో॥ "**విశ్వం** వై బ్రహ్మ తన్మాత్రం సంస్థితం **విష్ణుమాయయా ।**
ఈశ్వరేణ పరిచ్ఛిన్నం కాలేనావ్యక్తమూర్తినా ॥"

– ఇతి భాగవతే 3-10-12

4. **జగత్** । క్లీ. । గచ్ఛతీతి, గమ్+'**ద్యుతిగమిజహోతీనాం ద్వే చ**' ఇతి క్విపి ద్విత్వే చ 'గమః క్వౌ" ఇతి మలోపే తుక్ ।

విశ్వం, జగతీ, లోకః, పిష్టపం, భువనం, విష్టపం, సంసారః ।

శ్లో॥ "యదా స దేవో జాగర్తి తదేదం చేష్టతే **జగత్** ।
యదా స్వపితి **శాన్తాత్మా** తదా సర్వం నిమీలతి ॥ "

– ఇతి మనుః 1–52

ఎపుడు ఆ దేవుడు మేల్కాంచునో, అపుడీ జగత్తు వ్యాపారం గలదగును...

5. **దేవీ ।** దీవ్యతీతి, దివ్+అచ్+ఙీప్ । దేవి! – సంబుద్ధ్యంతం । హే యోగమాయే!

ఇట 'అర్గలాస్తోత్రమ్'ను అనుసంధానము చేసుకొనదగును.

మార్కండేయ ఉవాచ । ఓం

శ్లో॥ జయంతీ మంగళా కాలీ భద్రకాలీ కపాలినీ ।
దుర్గా క్షమా శివా ధాత్రీ **స్వాహా స్వధా** నమోఽస్తుతే ॥ 1

శ్లో॥ జయ **త్వం దేవి!** చాముండే జయభూతార్తిహారిణి ।
జయ సర్వగతే **దేవి! కాలరాత్రి!** నమోఽస్తు తే ॥ 2 ...

– ఇతి మార్కండేయపురాణే **దేవ్యాః అర్గలా స్తోత్రమ్.**

---

**శ్లో॥ విసృష్టౌ సృష్టిరూపా త్వం స్థితిరూపా చ పాలనే ।
తథా సంహృతిరూపాఽన్తే జగతోఽస్య జగన్మయే! ॥ 5**

**ప.వి. :** విసృష్టౌ, సృష్టిరూపా, త్వమ్, స్థితిరూపా, చ, పాలనే, తథా, సంహృతిరూపా, అన్తే, జగతః, అస్య, జగన్మయే!.

**ప్ర :** హే జగన్మయే! = ఓ భువనేశ్వరీ!, అస్య జగతః = ఈ జగత్తునకు, త్వమ్ = నీవు, విసృష్టౌ = జగత్తును సృష్టించుటయందు, సృష్టిరూపా = సృష్టిస్వరూపిణివి, త్వమ్ = నీవు, పాలనే = పాలించుటయందు, స్థితిరూపా = స్థితిస్వరూపిణివి, త్వమ్ = నీవు, అన్తే = ప్రలయకాలమునందు, సంహృతిరూపా = ప్రలయస్వరూపిణివి.

**తా :** ఓ భువనేశ్వరీ! ఈ సర్వజగత్తునకు నీవు సృష్టించుటయందు సృష్టిరూపిణిగను, పాలించుటయందు స్థితిరూపిణివిగను, ప్రలయకాలమునందు ప్రలయస్వరూపిణివి గదా!

**వి :** 1. విసృష్టౌ, పాలనే, అన్తే – ఇవి సప్తమీవిభక్త్యేకవచనరూపాలు.

2. సృష్టిరూపా, స్థితిరూపా, సంహృతిరూపా – ఇవి ఆకారాంత స్త్రీలింగ ప్రథమావిభక్తి ఏకవచనరూపాలు.

3. **జగన్మయే!** – ఇది ప్రథమావిభక్తి ఏకవచనం – సంబుద్ధ్యంతరూపం.

**జగన్మయా –** ఆకారాంత –స్త్రీ లింగము. వైదిక ప్రయోగము.

"**మయా** పదానికి **చికిత్సా** అని అర్థమున్నది. ఆప్టే నిఘంటువున. ఆ పదంతో సమసింపజేస్తే జగచ్చికిత్సారూపా అనే అర్థంలో **జగన్మయా** రూపం సిద్ధిస్తుంది. సంబోధనలో **జగన్మయే!** అవుతుంది."



**శ్లో॥ మహావిద్యా మహామాయా మహామేధా మహాస్మృతిః ।**
**మహామోహా చ భవతీ మహాదేవీ మహాసురీ ॥ 6**

**ప.వి. :** మహావిద్యా, మహామాయా, మహామేధా, మహాస్మృతిః, మహామోహా, చ, భవతీ, మహాదేవీ, మహాసురీ.

**ప్ర :** (హే జగజ్జనని!, త్వమ్ = నీవు), మహా(ఽ)విద్యా = మహావిద్యాస్వరూపిణివి, అవిద్యాస్వరూపిణివి, మహామాయా = అనిర్వచనీయమైన **యోగమాయవు,** మహామేధా = మహామేధాశక్తివి, మహాస్మృతిః = మహా ధారణాశక్తివి, మహామోహా = రాగద్వేషాదిరూపమగు అజ్ఞానశక్తివి, చ = మఱియు, భవతీ మహాదేవీ = సకలదేవతాశక్తివి, మహాసురీ = గొప్పరాక్షసశక్తివి, (త్వమేవ).

**తా :** ఓ జగజ్జననీ! నీవు మహావిద్యాస్వరూపిణివి, అవిద్యాస్వరూపిణివి, అనిర్వచనీయమైన యోగమాయవు, మహామేధాశక్తివి, మహాధారణాశక్తివి, రాగద్వేషాదిరూపమగు అజ్ఞానశక్తివి, సకలదేవతాశక్తివి, సకలరాక్షసశక్తియున్నూ నీవే.

**వి :** 1. **మహావిద్యా** – అ) 'మహతీ చ సా విద్యా చ। అనర్థనివారకత్వాన్మహత్వం వనదుర్గావిద్యాయా అపి మహావిద్యేతి సంజ్ఞా తద్రూపా వా।'

**– సౌభాగ్యభాస్కరభాష్యే (584)**

ఆ) సమస్త అనర్థనివారకమైన గొప్ప జ్ఞానస్వరూపురాలు. వనదుర్గావిద్యకు **మహావిద్యా** అని సంజ్ఞ గలదు.

ఇ) దశమహావిద్యలసమష్టిని '**మహావిద్యా**'గా పేర్కొనదగును.

దశమహావిద్యలు : 1. కాళి, 2. తార, 3. షోడశి, 4. భువనేశ్వరి, 5. త్రిపురభైరవి, 6. చిన్నమస్త, 7. ధూమవతి, 8. బగల, 9. మాతంగి, 10. కమల. ఇవన్నీ దేవీమూర్తులు.

ఈ) **మహావిద్యా – బ్రహ్మవిద్యయని** అర్థము. సకల వేదాంతములందు నుపదేశింపబడిన బ్రహ్మవిద్య ఇదియే యని ప్రాశస్త్యబోధక మీనామము. – **శ్రీకల.**

ఉ) **మహావిద్యా** (584) – మహావిద్యాస్తోత్రము స్వరూపముగా కలది.

'గొప్ప చదువు నిల్వు గుబ్బలిపిల్ల
పాఱు వేలిమియడ వలిగట్టుపట్టి
పెంద్రోవమస్తరు వెలితిప్పటెంకి
వరవు నెక్కువ చదువరి సల్పువేల్పు". – **తల్లివిన్కి.**

ఊ) **మహావిద్యా** – మహతో బ్రహ్మణో విద్యా **మహావిద్యా. – జయమంగళవ్యాఖ్యా.**

**ఋ) మహావిద్యా –**

శ్లో॥ ఏవం సప్తత్రింశత్సంఖ్యాకపదైర్మ**హావిద్యా ।**
షట్త్రింశత్ తత్త్వానాం తత్త్వాతీతస్య చాభిధాత్రీయమ్ ॥

**– వరివస్యారహస్యే** 2-27

పంచదశీమహామంత్రోపాసనయు 'మహావిద్య'గ పేర్కొనదగును. మిగిలిన వివరములకు వరివస్యారహస్యము చూడగలరు.

2. **మహామాయా** – (216) అ) త్రిమూర్తులకు కూడ మోహాన్ని కలుగజేయునది.

'ఎవ్వరెఱుగ నేరరే తల్లిగుట్టు
తనకు లోఁబర్చు నెంతటివారినైన
మిక్కిలి గొప్ప బూమియు గట్టుపట్టి
పొరిజాలి మబ్బుపువ్వుల వెల్లి వేల్పు'. – **తల్లివిన్కి.**

ఆ) **మహామాయా** (215) అ) బ్రహ్మాదీనామపి మోహకత్వాత్ **మహామాయా ।**

తదుక్తం మార్కండేయపురాణే

శ్లో॥ జ్ఞానినామపి చేతాంసి **దేవీ భగవతీ** హి సా ।
బలాదాకృష్య మోహాయ **మహామాయా** ప్రయచ్ఛతి ॥

ఆ) యద్వా '**మాయా** దంభే కృపాయామ్' చేతి కోశాత్ కృపా బహులా। నిఘంటువు నందు **మాయా** శబ్దమునకు **దయ** యను అర్థము కలదు కావున **హెచ్చయిన కృప** కలదని భావము. – **సౌభాగ్యభాస్కరభాష్యే.**

ఇ) **మహామాయా** (224) సకల జగత్తునకు మూలకారణమగు పరబ్రహ్మశక్తి అవివేకుల

అంతఃకరణములయందు వ్యామోహమును కలుగచేయునట్టి మహాశక్తి యనియు ధ్వని

– **శ్రీకల**.

ఈ) **మహామాయా** (212) – మాయావినామపి మాయావినీత్వాత్ **మహామాయా**.

– **జయమంగళవ్యాఖ్య**

**భవతీ** – ప్రథమా విభక్తి – ఏకవచనం.

భవతి – సంబోధన ప్రథమా విభక్తి – ఏకవచనం.

నాలుగాశ్రమాలవారిలో సంన్యాసులకు బ్రహ్మచారులకు మాత్రమే భిక్షాజీవనం అర్హమనీ, విహితమనీ శాస్త్రం చెబుతుంది. బ్రహ్మచారులు గురుకులవాసం చేసేటప్పుడు చాలా కొలది గృహములందు '**భవతి! భిక్షాం దేహి**' అని ఇల్లాండ్రనడిగి, తమ కోసం గురువుకోసం అన్నమును తెచ్చుకోవాలి. దీనివల్ల 2 ప్రయోజనాలు కలుగుతున్నవి. విద్యార్థి తన చదువుకోసం వినియోగించుకోడానికి ఎంతో కాలమూ, శక్తి దీనివల్ల కలసివస్తవనేది ఒకటి, రెండోది విద్యార్జన కవసరమైన వినయమై, చిత్తశుద్ధి దీనివల్ల అలవడుత వనేది – శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతీ స్వామివారు.

3. **మహాదేవీ** – స్త్రీ. అ) మహాదేవస్య పత్నీతి, పత్న్యర్థే జీష్। యద్వా మహతీ చాసౌ దేవీ చేతి। దుర్గా।

శ్లో॥ పూజ్యతే యాసురైః సర్వైర్మహతీతి ప్రమాణతః।
ధాతుర్మహేతి పూజాయాం **మహాదేవీ** తతః స్మృతా॥ – ఇతి **దేవీపురాణే**.

ఆ) **మహాదేవీ** (210) – సకల దేవతల కంటే అధికురాలు.

'అందరి వేల్పుల కన్నఁగన్నాకు
నెలచూలితల్లి వెన్నెల తేనిరాణి
తనడింగరీని బెద్దన్నల్పు వేల్పు
తోల్దాల్పు దాతొడన్దులకించు ముగతి'. – **తల్లివిన్కి**.

ఇ) **మహాదేవీ** (209) అథ '**కస్మాదుచ్యతే మహాదేవ**' ఇత్యాదినా నిరుక్తస్య మహాదేవస్య స్త్రీ **మహాదేవీ**। – జయమంగళవ్యాఖ్యా. విశేషములతో ప్రకాశించు బ్రహ్మశక్తి.



**శ్లో॥ ప్రకృతిస్త్వఞ్చ సర్వస్య గుణత్రయవిభావినీ।**
**కాలరాత్రిర్ మహారాత్రిర్ మోహరాత్రిశ్చ దారుణా॥** **7**

**ప.వి. :** ప్రకృతిః, త్వమ్, చ, సర్వస్య, గుణత్రయ-విభావినీ, కాలరాత్రిః, మహారాత్రిః, మోహరాత్రిః, చ, దారుణా.

**ప్ర :** సర్వస్య = జగత్తునకు, త్వమ్ = నీవు, ప్రకృతిః = చరాచరసృష్టికి మూలకారణ స్వరూపురాలవు, చ = మఱియు, గుణత్రయవిభావినీ = త్రిపుటుల సత్త్వరజస్తమో-గుణముల సృష్టికర్త్రివి/ విభాగకర్త్రివి, కాలరాత్రిః = కాలరాత్రివి, మహారాత్రిః = మహారాత్రివి, మోహరాత్రిః చ = మోహరాత్రివిన్నూ, దారుణా = అత్యన్తభయంకరివి.

**తా :** ఓ జననీ! జగత్తునంతటికి నీవు మూలకారణస్వరూపురాలవు. త్రిపుటుల త్రిగుణముల సృష్టికర్త్రివి మఱియు విభాగకర్త్రివి. కాలరాత్రివి, మహారాత్రివి మఱియు మోహరాత్రివిన్నూ. అత్యన్తభయంకరివి.

**వి :** 1. **ప్రకృతిః -** స్త్రీ 1. ప్రక్రియతే కార్యాదికమనయేతి । ప్ర + కృ + క్తిన్ । శక్తిః।

శ్లో॥ ప్రధానం **ప్రకృతిః శక్తిర్నిత్యా** చావికృతిస్తథా ।
ఏతాని తస్యా నామాని శివమాశ్రిత్య యా స్థితా ॥ - ఇతి శార్ఙ్గధరః.

2. శ్రీబ్రహ్మవైవర్తపురాణే ద్వితీయఖండే ప్రథమోఽధ్యాయే -

శ్లో॥ గణేశజననీ దుర్గా రాధా లక్ష్మీః సరస్వతీ ।
**సావిత్రీ** వై సృష్టివిధౌ **ప్రకృతిః** పంచధా స్మృతా ॥ 1... ...

చరాచరసృష్టికి కారణభూతమై **ప్రకృతి** గణేశుని తల్లి దుర్గగా, రాధగా, లక్ష్మీదేవతగా, సరస్వతీదేవిగా, సావిత్రీమాతగా ఐదు మూర్తులతో పరిఢవిల్లుతున్నది.

నారాయణ ఉవాచ - నారాయణుడిట్లనెను.

శ్లో॥ **ప్రకృతేర్లక్షణం** వత్స కోవా వక్తుం క్షమో భవేత్ ।
కించిత్తదాపి వక్ష్యామి యత్ శ్రుతం ధర్మవక్త్రతః ॥ 4

ప్రకృతియొక్క స్వరూపమును చక్కగా ఎవరు కూడా చెప్పలేరు. కాని ధర్ముని వలన విన్న విషయములను కొంత చెప్పెదను.

శ్లో॥ ప్రకృష్టవాచకః ప్రశ్చ కృతిశ్చ సృష్టివాచకః ।
సృష్టౌ ప్రకృష్టా యా దేవీ **ప్రకృతిః** సా ప్రకీర్తితా ॥ 5

**ప్ర** అనునది శ్రేష్ఠము అను నర్థము నిచ్చును. **కృతి** అనగా సృష్టి. సృష్టిలో శ్రేష్ఠురాలైన **దేవతను ప్రకృతి** యని అందురు.

శ్లో॥ గుణే ప్రకృష్టసత్త్వే చ **ప్ర**శబ్దో వర్తతే శ్రుతౌ ।
మధ్యమే **కృ**శ్చ రజసి **తి** శబ్దస్తమసి స్మృతః ॥ 6

**ప్ర** అనునది ఉత్కృష్టమైన సత్త్వగుణమును సూచించును. **కృ** అనునది రజోగుణమును,, **తి** అనునది తమోగుణమును తెలుపును.

శ్లో॥ త్రిగుణాత్మస్వరూపా యా సర్వశక్తిసమన్వితా ।
ప్రధానా సృష్టికరణే **ప్రకృతి**స్తేన కథ్యతే ॥ 7

సత్త్వరజస్తమో గుణస్వరూపిణి, సర్వశక్తి సమన్వితమైనది ఏదో అది సృష్టి విషయమున ప్రధానస్థానము వహించుటచేత **ప్రకృతి**యని పేర్కొనబడినది.

ఇక ప్రకృతియొక్క ద్వితీయరూపమును తెలిసికొనుటకు,

మరిన్ని వివరములకు **ప్రకృతిఖండమును** అధ్యయనము చేయదగును.

2. **గుణత్రయవిభావినీ** – అ) ఇట శ్రీమద్భగవద్గీత – చతుర్దశాధ్యాయమగు గుణత్రయవిభాగమును (22 నుండి 26 వరకు) అనుసంధానము చేసికొందుము గాక.

శ్లో॥ ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ! ।
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి ॥ 22

శ్లో॥ ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే ।
గుణా వర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేఙ్గతే ॥ 23

శ్లో॥ సమదుఃఖసుఖస్స్వస్థ – స్సమలోష్టాశ్మకాఞ్చనః ।
తుల్యప్రియాప్రియో ధీర – స్తుల్యనిన్దాత్మసంస్తుతిః ॥ 24

శ్లో॥ మానావమానయోస్తుల్య – స్తుల్యో మిత్రారిపక్షయోః ।
సర్వారమ్భపరిత్యాగీ – గుణాతీతస్స ఉచ్యతే ॥ 25

'సత్త్వగుణలక్షణం ప్రకాశం. రజోగుణలక్షణం కార్యప్రవృత్తి. తమోగుణ లక్షణం అజ్ఞానం. ఇవి ఏవి ఎలా కలిగినా లెక్కచేయక, రాగద్వేషాలను వదలి, ఉన్నదాన్ని అక్కర్లేదని కానీ, లేనిది కావలని కాని కోరకుండా, తటస్థంగా ఉండి, ఎవ్వరు గుణాలచేత ఏ కొంచెం చాంచల్యం పొందకుండా ఉంటారో, ప్రకృతి గుణాలు తమ స్వభావంతో ఉంటున్నాయని అనుకుంటూ స్థిరముగా ఉండి, ఆసక్తిలేక సుఖదుఃఖాలు, ఇష్టానిష్టాలు, నిందాస్తోత్రాలు, సమ్మానవమానాలు, శత్రువులు మిత్రులు – ఇటువంటి ద్వంద్వాల

విషయంలో సమానభావము కలవారై, ధీరులై, స్థిరచిత్తంతో, రాయి, బంగారము, మట్టి వీటిని సమానంగా భావిస్తూ, తమకు తాముగా ఏపనిని ప్రారంభించక, కర్తవ్యాన్ని శ్రద్ధతో నిర్వహిస్తారో వారు **గుణాతీతులు** అవుతారు.'

సత్త్వ - రజ - స్తమోగుణాల ప్రభావాలకు లొంగని వారెవరైనా ఉంటారా? అంటే **తప్పకుండా ఉంటారు. -** అంటుంది శ్రీమద్భగవద్గీత. మీదుమిక్కిలి గుణాతీతస్థితిని సంపాదించాలంటే సాధ్యమవుతుందా? అంటే **ఎందుకు సాధ్యం కాదు -** అంటుంది శ్రీమద్భగవద్గీత.

శ్లో॥ మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే ।
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే ॥ 26

అనన్యమైన భక్తితో భగవంతుణ్ణి ఎవరు సేవిస్తారో వారికి ఈ గుణాతీతస్థితి తప్పక కలుగుతుంది. వారు పై గుణాలకు/గుణకార్యాలకు లోబడరు. వారికి **పరబ్రహ్మ సాయుజ్యం** కలుగుతుంది.

ఆ) శ్రీమద్భగవద్గీతా - గుణత్రయవిభాగము - చతుర్దశాధ్యాయార్థసంగ్రహశ్లోకం - శ్రీమదభినవగుప్తాచార్యులు.

శ్లో॥ లసద్ భక్తిరసావేశహీనాహంకారవిభ్రమః ।
స్థితోఽపి గుణసంమర్దే గుణాతీతః సమో యతిః ॥

భక్తిరసావేశముచే విరాజిల్లువాడును, అహంకారమును పరిత్యజించిన వాడును అగు సాధకుడు గుణసమూహమునందు ఉన్నప్పటికినీ గుణాతీతుడుగానే చెప్పబడు చున్నాడు.

ఇ) శ్రీమద్భగవద్గీతా - **చతుర్దశాధ్యాయార్థసంగ్రహశ్లోకం -** శ్రీమద్భగవద్రామానుజా చార్యులు.

శ్లో॥ గుణబన్ధవిధాస్తేషాం కర్తృత్వం తన్నివర్తనమ్ ।
గతిత్రయస్వమూలత్వం చతుర్దశ ఉదీర్యతే ॥

ఈ పదునాల్గవ యధ్యాయమున - శుద్ధాత్మకు గుణములు బంధ హేతువులగు రీతియు, ఆ గుణములకు కర్తృత్వము కలుగు విధానమున్ను, అవి నివర్తించు మార్గమున్ను, ఐశ్వర్యకైవల్య భగవత్ప్రాప్తులకు మూడిండికిని, **భగవంతుడే/ భగవతియే** కారణమగుట చెప్పబడినవి. అస్తు.

3. అ) **కాలరాత్రిః** । కాలరాత్రీ । స్త్రీ । కాలో మరణం తదుపలక్షితా రాత్రిః । కల్పాన్తరాత్రిః ।

ఆ) A particular night in the life of man, on the 7th day of the 7th month of the 77th Year. - Apte.

ఇ) కార్తికమాసామావాస్యతో కూడిన చతుర్దశీతిథికిన్ను **కాలరాత్రి** యని నామము.

ఈ) శ్లో॥ కాళరాత్ర్యాదిశక్త్యౌఘవృతా స్నిగ్ధౌదనప్రియా ।
మహావీరేంద్రవరదా రాకిన్యంబాస్వరూపిణీ ॥ 101

– శ్రీలలితాసహస్రనామస్తోత్రమ్. – సౌభాగ్యభాస్కరభాష్యే.

'అస్తి కాలరాత్రాఖ్యా కాచన శక్తిః. తదుక్తం వరాహపురాణే మూర్తిత్రయం ప్రకృత్య.

శ్లో॥ యా సా నీలగిరిం యాతా తపసే ధృతమానసా ।
రౌద్రీ తమోభవా శక్తిః తస్యాః శ్రుణు ధరే వ్రతమ్ ॥

ఇత్యారభ్య

శ్లో॥ రౌద్రీ తపోరతా **దేవీ** – తామసీశక్తిరుత్తమా ।
సంహారకారిణీ నామ్నా – **కాలరాత్రీతి** తాం విదుః ॥ ఇతి.

సా ఆదిః యాసాం తాసాం కంఠాద్యంతద్వాదశశక్తీనామ్ ఓఘేన సమూహేన వృతా. పత్రేషు వేష్టితా.

4. **మహారాత్రిః** । స్త్రీ । అ) మహతః ఈశ్వరస్య రాత్రి ర్మహారాత్రిః । మహతః బ్రహ్మణో మరణోపలక్షితా రాత్రిరితి యావత్ ।

ఆ) ఆశ్వయుజ శుద్ధాష్టమియే **మహాష్టమీ ।** దుర్గాష్టమీ తిథియందలి రాత్రియే **మహారాత్రి** యనబడును.

5. **మోహరాత్రిః** । స్త్రీ. । అ) మోహః అకర్తవ్యే కర్తవ్యమితి గ్రహః స ఏవ రాత్రిరివ రాత్రిః బుద్ధిమోహకత్వాత్ మోహరాత్రిః **నిద్రాస్వరూపా** వా । – చతుర్ధరీ వ్యాఖ్య.

ఆ) శ్రీకృష్ణజన్మాష్టమినాటి రాత్రియే **మోహరాత్రి** యనబడును./ లేదా మంగళవార యుక్తమైన వైశాఖశుక్లతృతీయతిథియందలి రాత్రియే **మోహరాత్రి** యనబడును.

మోహరాత్రిః మమతావర్తమోహగర్తపాతినీ । మహామాఖ్యా సంసృతికర్త్రీ । ఉక్తఞ్చ–

శ్లో॥ దంష్ట్రాకరాలకాలాగ్నిరుద్రకల్పాతి**దారుణా ।**
**మోహరాత్రి** ర్మోహతను–ర్జగత్సూతే జగత్కరీ ॥ ఇతి – నాగోజీభట్టీ వ్యాఖ్య.

**కాలరాత్రి, మహారాత్రి మోహరాత్రి – ఈ పుణ్యతిథులన్నింటికిని శ్రీమన్నారాయణుని యోగమాయయే అధిష్ఠాత్రి.**

**శ్లో॥ త్వం శ్రీస్త్వమీశ్వరీ త్వం హ్రీస్త్వం బుద్ధిర్ బోధలక్షణా ।**
**లజ్జా పుష్టిస్తథా తుష్టిస్త్వం శాన్తిః క్షాన్తిరేవ చ ॥ 8**

**ప.వి. :** త్వమ్, శ్రీః, త్వమ్, ఈశ్వరీ, త్వమ్, హ్రీః, త్వమ్, బుద్ధిః, బోధలక్షణా, లజ్జా, పుష్టిః తథా, తుష్టిః, త్వమ్, శాన్తిః, క్షాన్తిః, ఏవ, చ.

**ప్ర :** త్వమ్ = నీవు, శ్రీః = లక్ష్మివి, త్వమ్ = నీవు, ఈశ్వరీ = సరస్వతివి, త్వమ్ = నీవు, హ్రీః = భువనేశ్వరివి, త్వమ్ = నీవు, బుద్ధిః = నిశ్చయాత్మకమగు బుద్ధిరూపిణివి, త్వమ్ = నీవు, బోధలక్షణా = జ్ఞానలక్షణ స్వరూపిణివి, త్వమ్ + ఏవ = నీవే, లజ్జా = లజ్జా స్వరూపిణివి, పుష్టిః = పుష్టిస్వరూపిణివి, తుష్టిః = తుష్టిస్వరూపిణివిన్నూ, చ = మరియు, శాంతిః = శాన్తిస్వరూపిణివి, క్షాన్తిః = క్షమాస్వరూపిణివి.

**తా :** (ఓ యోగనిద్రాదేవీ!), నీవు లక్ష్మివి. నీవు సరస్వతివి. నీవు భువనేశ్వరివి. నిశ్చయాత్మికమగు బుద్ధివి నీవు, జ్ఞానలక్షణము కలదానవున్ను నీవే. నీవే లజ్జాస్వరూపిణివి, పుష్టిస్వరూపిణివి, తుష్టిస్వరూపిణివి. నీవే శాంతిస్వరూపిణివి, క్షమాస్వరూపిణివిన్నూ.

**వి :** అ) ఈ శ్లోకమున శ్రీమన్నారాయణుని **యోగనిద్రాదేవి** యొక్క మంత్రోద్ధారమును ఇవ్విధముగ గ్రహింపదగును.

అ) శ్రీం – లక్ష్మీబీజము : శ్రీ – అక్షరస్వరూపము, శ్రీః – లక్ష్మీదేవి స్వరూపము, శ్రీం – లక్ష్మీదేవి బీజాక్షరం. శ్+ర్+ఈ$^3$+(బిందువు)/(**సుషుప్తి**)+(అర్ధచంద్రము+రోధినీ+నాదం+నాదాంతం+శక్తి+ వ్యాపికా)(**తుర్యావస్థ**)+(సమనా+ఉన్మనా)/(**తుర్యాతీతావస్థ**) ===>మహాబిందువు

ఆ) ఈశ్వరీ – సరస్వతీదేవి, **ఐ** – అక్షరస్వరూపం, **ఐః** – సరస్వతీదేవి స్వరూపమ్, **ఐం** – ఐ$^3$+బిందునాదయుతం – సరస్వతీదేవిబీజాక్షరం

ఇ) హ్రీం – భువనేశ్వరీబీజము/ మాయాబీజము : **హ్రీ** – అక్షరస్వరూపము, **హ్రీః** – భువనేశ్వరీస్వరూపం

**హ్రీం**–హ్+ర్+ఈ$^3$+బిందునాదయుతం – భువనేశ్వరీదేవి బీజాక్షరం

ఈ) **అర్ధచంద్రము+రోధినీ+నాదం+నాదాంతం+శక్తి+వ్యాపికా+సమనా+ఉన్మనా।**

ఈ భాగాన్ని సాధారణంగా **నాదం**గా పరిగణిస్తారు.

ఉ) ఈ సూక్తం – చండీసప్తశతిగ్రంథాంతర్గత ప్రథమచరిత్రమున కలదు. దానికి వినియోగమీ విధముగ నున్నది.

ఓం ప్రథమచరిత్రస్య **బ్రహ్మా** ఋషిః, మహాకాలీ దేవతా, గాయత్రీ ఛందః, నందా శక్తిః, **రక్తదంతికా బీజమ్** అగ్నిస్తత్త్వమ్, ఋగ్వేదః స్వరూపమ్, శ్రీమహాకాలీ ప్రీత్యర్థే ప్రథమచరిత్ర జపే వినియోగః ।

# - ధ్యానమ్ -

ఓం

**ఖడ్గం చక్రగదేషుచాపపరిఘాన్ శూలం భుశుండీం శిరః**
**శంఖం సందధతీం కరైస్త్రినయనాం సర్వాంగభూషావృతామ్ ।**
**నీలాశ్మద్యుతిమాస్యపాదదశకాం సేవే మహాకాలికాం**
**యామస్తౌత్స్వపితే హరౌ కమలజో హంతుం మధుకైటభమ్ ॥**

। ఓం నమశ్చండికాయై ।

**'ఓం ఐం'** మార్కండేయ ఉవాచ । 1

**ఐం** – బ్రహ్మబీజం, **రక్తదంతికాబీజం.**

1. కనుక **ఈశ్వరీ** పదము సరస్వతీదేవి పరంగా గ్రహించబడినది. అందుచే ఐః – సరస్వతీదేవి స్వరూపంగాను, ఐం – సరస్వతీదేవి బీజాక్షరంగాను గ్రహించబడినది.

2. బ్రహ్మదేవుడు – '**త్వం స్వాహా** త్వం స్వధా...' అంటూ శ్రీమన్నారాయణుని మహాశక్తియగు 'యోగనిద్రానిత్యాదేవి'ని స్తుతించెను.

3. ఈ ప్రథమచరితమునందు '**విశ్వేశ్వరీం**....70 శ్లోకం నుండి .... మహాసురౌ ॥ 87 ॥ వఱకు గల భాగమునకు 'తంత్రోక్తరాత్రిసూక్తమ్ / విశ్వేశ్వరీసూక్తమ్' గా చెప్పబడినది.

4. (యోగ**నిద్రా** / యోగ**మాయా**) నిత్యాదేవియొక్క మహామంత్రము ఇవ్విధంగా గ్రహింపదగును.

**'ఓం శ్రీం ఐం హ్రీం స్వాహా'**

2. **బుద్ధిః** – అ) షట్ త్రింశత్తత్త్వములలో '**బుద్ధి**' ఒకటి.

1. శివః, 2. శక్తిః, 3. సదాశివః, 4. ఈశ్వరః, 5. శుద్ధవిద్యా, 6. మాయా, 7. కలా, 8. విద్యా, 9. రాగః, 10. కాలః, 11. నియతిః, 12. పురుషః, 13. ప్రకృతిః, 14. అహంకారః, 15. **బుద్ధిః,** 16. మనః, 17. శ్రోత్రమ్, 18. త్వక్, 19. చక్షు, 20. జిహ్వా, 21. ఘ్రాణమ్, 22. వాక్, 23. పాణీ, 24. పాదౌ, 25. పాయుః, 26. ఉపస్థః, 27. శబ్దః, 28. స్పర్శః, 29. రూపమ్, 30. రసః, 31. గంధః, 32. ఆకాశః, 33. వాయుః, 34. అగ్నిః, 35. జలమ్, 36. పృథ్వీ.

ఆ) శ్లో॥ మహాభూతాన్యహంకారో **బుద్ధి**రవ్యక్తమేవ చ ।
ఇంద్రియాణి దశైకం చ పంచ చేన్ద్రియగోచరాః ॥ భ.గీ. 13-5

పృథివ్యాది పంచభూతములున్ను, అహంకారతత్త్వమున్ను, బుద్ధియను మహత్తత్త్వమున్ను, మూలప్రకృతియును, ఇంద్రియములు - పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, మనస్సు అనెడు పదునొకండును - ఇంద్రియములచే నెఱుంగదగిన విషయములును.

శ్లో॥ **బుద్ధే**రుత్పత్తిరవ్యక్తాత్తతోఽహంకారసంభవః ।
తన్మాత్రాదీన్యహంకారాదేకోత్తరగుణాని చ ॥
- యాజ్ఞవల్క్యస్మృతిః ప్రాయశ్చిత్తాధ్యాయః ।

బుద్ధియొక్క పుట్టుక ప్రకృతినుండి. బుద్ధినుండి అహంకారం జనించినది. (వైకారికము, తైజసము, భూతాది అని అహంకారము 3 విధాలు), భూతాది అనే పేరుగల **తామసాహంకారము** నుండి సూక్ష్మ, స్థూల, మహాభూతాలు ఉద్భవించినవి. **వైకారికాహంకారం** నుండి బుద్ధీంద్రియాలు, **తైజసాహంకారము** నుండి కర్మేంద్రియాలు జనించాయి.

ఇ) పల్లవి : శ్రీ కమలాంబికాయాః పరం నహి రే రే చిత్త!
**క్షిత్యాదిశివాంతతత్త్వస్వరూపిణ్యాః**

శ్రీ ముత్తుస్వామి దీక్షితుల వారు తమ 'నవావరణ కీర్తనల్లో' పల్లవిలో 'కమలాంబిక' వారిని పంచమీ విభక్తిలో పైవిధంగా కీర్తించారు.

ఈ 36 తత్త్వాలను మూడు రకాలుగా విభజించారు.

1. శివతత్త్వములు (5). శుద్ధవిద్య, ఈశ్వర, సదాశివ, శక్తి, శివ,

2. విద్యాతత్త్వములు : (7) పురుష, నియతి, కాల, రాగ, అవిద్య, కల, మాయ.

3. ఆత్మ (జీవుడు అనబడేవాని) తత్త్వములు : ఇవి 24. పంచభూతాలు (5), పంచతన్మాత్రలు (5), పంచకర్మేంద్రియాలు (5), పంచజ్ఞానేంద్రియాలు (5), మనస్సు, **బుద్ధి,** అహంకారము, ప్రకృతి. '**బుద్ధితత్త్వమయస్వరూప**' యని ఇట కీర్తింపబడినది.

3. **లజ్జా** (740) - అ) సిగ్గు శ్రీదేవీ స్వరూపము

'మంచి సిగ్గెలరెడు మలదొర పిల్ల
డింగరీనికి నుబ్బి డెమలర్చు వేల్పు ॥ - **తల్లివిన్కి**

ఆ) ఇదియొక రహస్యసంకేతము. నిర్వికల్పసమాధి యని యొక యర్థము. పవిత్రతమమగు మంత్రవిశేషమునకు సంకేతము. మంత్రవిశేషము గురుముఖైకవేద్యము.

ఇ) **లజ్జా** (740) – 'యా దేవీ సర్వభూతేషు **లజ్జా** రూపేణ సంస్థితా'

ఇతి స్మరణాల్లజ్జా. **హృల్లేఖా**బీజస్వరూపా వా । –సౌభాగ్యభాస్కరభాష్యే.

'దేవి అన్ని ప్రాణులందును **లజ్జా** రూపముతో నున్నదని పెద్దలమాట. లేదా హ్రీం బీజస్వరూపురాలు'

ఈ) **లజ్జా** । స్త్రీ । లజ్జనమితి, లస్జ్ వ్రీడనే + '**గురోశ్చ హలః**' ఇతి అ, టాప్ ।

అంతఃకరణవృత్తివిశేషం, అకర్తవ్యకర్మణి పరజ్ఞానభయమ్, హ్రీః;

శ్లో॥ **లజ్జా** తిరశ్చాం యది చేతసి స్యాదసంశయం పర్వతరాజపుత్ర్యాః ।
తం కేశపాశం ప్రసమీక్ష్య కుర్యుర్వాలప్రియత్వం శిథిలం చమర్యః ॥

– ఇతి కుమారసంభవే 1–49

4. **పుష్టిః** (445) – అ) సకలభూతములయందు పోషణరూపముగానున్నది.

'కొల్చువారిఁబొదలు కొల్పించు తల్లి
ఎల్లవారలకు లావెసఁగించు వేల్పు ॥ – **తల్లివిన్కి.**

ఆ) **పుష్టిః** (446) – దేవదారువనే పుష్టిః, అందటియందున్న పుష్టిస్వరూపిణి. దేవదారువనమందు పుష్టిరూప దేవత ఐనది.

ఇ) పుష్టిః – **పుష** ఇతి ధాతోః పుష్టిః । **పుష్టయశ్చ దశేతి** । శ్రీరుద్రభాష్యే భట్టభాస్కరః – 1. వాక్పుష్టిః, 2. జ్ఞానపుష్టిః, 3. శరీరపుష్టిః, 4. ఇంద్రియపుష్టిః,5.6. ధనధాన్యపుష్టిః, 7. ప్రజాపుష్టిః, 8. పశుపుష్టిః, 9. గ్రామపుష్టిః, 10. ధర్మపుష్టయశ్చేతి దశపుష్టయ ఇతి । తత్సమష్టిరూపేత్యర్థః । తదుక్తం సప్తశత్యాం –

'యా దేవీ సర్వభూతేషు **పుష్టిరూపేణ** సంస్థితా' ఇత్యేతత్ – జయమంగళవ్యాఖ్యా

5. **తుష్టిః (442)** అ) తోష ఇతి ధాతోః భావే క్తః తుష్టిః । సమష్టి తుష్టిరూపేత్యర్థః । సమూహతేజో యత్తే రూపం కల్యాణతమం తత్ పశ్యామీతి శ్రుతేః । సప్తశత్యాం –

'యా దేవి సర్వభూతేషు **తుష్టి**రూపేణ సంస్థితా' ఇతి – జయమంగళవ్యాఖ్యా.

ఆ) **తుష్టిః** (443) తుష్ట్యాదీని సప్తనామాని తోష, పోష, జ్ఞాన, ధైర్య, శమ, కల్యాణవత్త్వకమనీయతా వాచకాని సంతి । తాదృశభగవతీ స్వరూపత్వాభిప్రాయేణ తామప్యభిదధతి.

మల్లాదిమాహాత్మ్యేపి–

*శ్లో॥ యో దేవస్సర్వభూతేషు* ***తోష****రూపేణ సంస్థితః ।*
*నమస్తస్మై నమస్తస్మై నమస్తస్మై నమోనమః ॥*

దేవీభాగవతే –

శ్లో॥ **బుద్ధిః** కీర్తిర్ ధృతిర్ లక్ష్మీః **శక్తిః** శ్రద్ధా మతిః **స్మృతిః** ।
సర్వేషాం ప్రాణినాం సాంబా ప్రత్యక్షం తన్నిదర్శనమ్ ॥ ఇతి.

పాద్మపురాణే –

'దేవీక్షేత్రగణనావసరే **తుష్టిర్వ**జ్రేశ్వరీ తథా ' – సౌభాగ్యభాస్కరభాష్యే.

6. **శాన్తిః (448) –** అ) అపచారసహిష్ణుత్వా**చ్ఛాన్తి** స్సమష్టిశాన్తిరిత్యర్థః । తదుక్తం సప్తశత్యాం – 'యా దేవీ సర్వభూతేషు **శాంతి**రూపేణ సంస్థితా' । ఇతి.

ఆ) **శాన్తిః** (447) తదుక్తం శైవాగమే –

శ్లో॥ మలమాయావికారేషు **శాంతిః** పుంసః పునర్యయా ।
సా కలా **శాంతి**రిత్యుక్తా సాధికారాస్పదం పదమ్ । ఇతి

జీవునికి **ఆణవాదిమలములు** దేనితో శాంతించుచున్నవో అది **శాంతి** యనబడును.

**ఆణవాదిమలములు :** 1. **ఆణవము** – పరబ్రహ్మమును గూర్చి అప్పుడప్పుడు కలిగెడు జ్ఞానమును మఱుగు పరచునది. 2. **కార్మికము** – గురువు బోధించిన పరమార్థమున బుద్ధిని చోరనీయనిది. 3. **మాయికము** – పరతత్త్వజ్ఞానవాసనను ఎప్పుడునూ కలగనీయనిది. 4. **మాయేయము** – పాపకార్యములందు మాత్రమే బుద్ధిని చొప్పించునది. 5. **తిరోధానము** – పరబ్రహ్మము అనిత్యమను బుద్ధిని కలిగించి సంసారమున బడవేయునది.

బృహత్పారాశరస్మృతావపి –

శ్లో॥ దశ పంచాంగుళవ్యాప్తం – నాసికాయా బహిః స్థితమ్ ।
జీవో యత్ర విశుద్ధేత సా కలా **షోడశీ** స్మృతా ॥ – ఇతి.

నాసికకు 15 అంగుళముల బాహ్యస్థానమును వ్యాపించి మలములను పారద్రోలి జీవుని శుద్ధిచేయు **కలా** స్థానమునకు **షోడశీ** యనిపేరు. దీనికే **శాంతి** అనియును.

ఇ) **శాంతిపాఠః**

ఓం ద్యౌశ్శాన్తిరన్తరిక్షః శాన్తిః పృథ్వీ శాన్తిరాపః శాన్తిరోషధయః శాన్తిః । వనస్పతయః శాన్తిర్విశ్వే దేవాః శాన్తిర్బ్రహ్మ శాన్తిః సర్వః శాన్తిః శాన్తిరేవ శాన్తిః సా మా శాన్తిరేధి ॥

ఓం । **శాన్తిశ్ శాన్తిశ్ శాన్తిః** । ఓం

7. **క్షాన్తిః** । స్త్రీ । (క్షమ్+భావే+క్తిన్) తితిక్షా, సహిష్ణుతా, క్షమా,...

శ్లో॥ శమోదమస్తపశ్శౌచం - **క్షాన్తి**రార్జవ మేవ చ ।
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం - బ్రాహ్మం కర్మ స్వభావజమ్ । - భ.గీ. 18-42

జ్ఞానేంద్రియ నిగ్రహం, కర్మేంద్రియ నిగ్రహం, శారీరక - వాచిక - మానసిక తపస్సులు, పరిశుభ్రత, **ఓర్పు**, కపటం లేకపోవటం, జ్ఞాన- విజ్ఞానాలు దేవునిపైన, పునర్జన్మపైన, వేదాలపైన నమ్మకం - ఇవి బ్రాహ్మణునకు స్వభావసిద్ధమైన కర్మలు.

2. శ్లో॥ అహింసా సత్యమస్తేయం - శౌచమిన్ద్రియనిగ్రహః ।
దానం దమో దయా **క్షాన్తిః** - సర్వేషాం ధర్మసాధనమ్ ॥

-యాజ్ఞవల్క్యస్మృతిః - ఆచారాధ్యాయః.

'అహింస, సత్యం, ఎవ్వని వస్తువును తీసికొనకపోవడం, బాహ్యాభ్యంతర పరిశుభ్రత, ఇంద్రియనిగ్రహము, దానము, మనోనిగ్రహం, ఆపదలలో ఉన్నవానిని రక్షించడం, **ఓర్పు** - ఇవి బ్రాహ్మణాది చండాలాంతం అందఱికిన్నూ **ధర్మానికి** సాధనం.



**శ్లో॥ ఖడ్గినీ శూలినీ ఘోరా గదినీ చక్రిణీ తథా ।
శంఖినీ చాపినీ బాణ - భుశుండీ - పరిఘాయుధా ॥ 9**

**ప.వి. :** ఖడ్గినీ, శూలినీ, ఘోరా, గదినీ, చక్రిణీ, తథా, శంఖినీ, చాపినీ, బాణ - భుశుండీ - పరిఘాయుధా.

**ప్ర. & తా. :** ( ఓ యోగమాయా! ఓ యోగనిద్రా!), త్వమ్ = నీవు, ఖడ్గినీ = 'ఖడ్గ' ఆకృతిగ నున్న శక్తిస్వరూపిణివి. బాణ - భుశుండీ - పరిఘాయుధా = బాణ, భుశుండీ - పరిఘశ్చ ఆయుధాని యస్యాః సా ।

**వి :** 1. చండీసప్తశతీగ్రంథాన్తరగత ప్రథమచరిత్ర - ధ్యానశ్లోకమును నిట అనుసంధానము చేసికొనదగును.

### ధ్యానశ్లోకము

**శ్లో॥ ఖడ్గం చక్రగదేషుచాపపరిఘాన్ శూలం భుశుండీం శిరః
శంఖం సందధతీం కరైస్త్రినయనాం సర్వాంగభూషావృతామ్ ।
నీలాశ్మద్యుతిమాస్యపాదదశకాం సేవే మహాకాలికాం
యామస్తౌత్స్వపితే హరౌ కమలజో హంతుం మధుకైటభమ్ ॥**

2. యోగనిద్రాదేవికున్న ఈ దశవిధ ఆయుధశక్తులే స్వరూపముగా నున్న వాటిలో **చక్రిణీ** శక్తియే శ్రీమన్నారాయణుని ద్వారా ప్రయోగింపబడి మధుకైటభులను రాక్షసులు హతులైనారని గ్రహింతురుగాక.

2. ఈ శ్లోకమును '**దశమహావిద్యల**' కు ప్రతీకగా భావింపదగును.

3. శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రమున దివ్యాయుధముల వైభవమును దర్శింపజేయు ఈ దిగువ శ్లోకమును నిట కాంచుము.

శ్లో॥ శఙ్ఖభృత్ నన్దకీ చక్రీ శార్ఙ్గధన్వా గదాధరః ।
రథాంగపాణి రక్షోభ్యః సర్వప్రహరణాయుధః ॥ 107

1. శఙ్ఖభృత్ : స్వాధరవిద్రుమసుధయా **పాంచజన్యం** పుష్ణాతీతి.

ఆయుధములు సాధారణంగా 'ఛిన్నం భిన్నం శరైర్దగ్ధం' అన్నట్లు శత్రుశరీరములను ఖండఖండములుగా నరకుట, తగలబెట్టుట మొదలైన బాధలను క్రమంగా కలిగించును. ఐతే **శంఖము** అట్లుగాక 'సఘోషో ధార్తరాష్ట్రాణాం ... హృదయాని వ్యదారయత్ ।' అన్నట్లు 'తన గంభీరధ్వనిని విన్నంతమాత్రము చేతనే శత్రువుల గుండెలను చీల్చివైచును' అను దానిని నిట గ్రహింపవలయును.

అటువంటి ధ్వని లేదా నాదస్వరూపిణియే '**శంఖినీ**'

2. **చక్రీ :** నిత్యసుదర్శనః - స్వభృత్యసురప్రతిభటరక్షోఽసుర శోణిత కల్మాషిత జ్వాలాంచితం చక్రమపి తథైవేతి - చక్రీ - శ్రీపరాశరభట్టర్‌వారి భాష్యం.

అటువంటి జ్వాలాస్వరూపిణియే - **చక్రిణీ.**

---

**శ్లో॥ సౌమ్యా(ఽ) సౌమ్యతరాఽశేష-సౌమ్యేభ్యస్త్వతిసున్దరీ ।**
**పరాపరాణాం పరమా త్వమేవ పరమేశ్వరీ ॥ 10**

**ప.వి. :** సౌమ్యా, సౌమ్యతరా, అశేష-సౌమ్యేభ్యః, తు, అతిసుందరీ, పరాపరాణామ్, పరమా, త్వమ్, ఏవ, పరమేశ్వరీ.

**ప్ర :** (హే జనని! = ఓ తల్లీ!), త్వమేవ = నీవే, సౌమ్యా = శాంతస్వరూపిణివి, సౌమ్యతరా = శాంతమూర్తులందరికన్నా మీదుమిక్కిలి శాంతముగలదానవు. '**శాంత**మే నీవు తల్లీ' అని భావము. అశేషసౌమ్యేభ్యః+తు+అతిసుందరీ = సౌందర్యవంతులను మించిన గొప్ప సౌందర్యము కలదానవై భాసించుచున్నదానవు, పరాపరాణాం పరమా = శ్రేష్ఠమైన దేవతాసమూహంలోను తదితరులలోను మిక్కిలి శ్రేష్ఠవు, త్వమేవ = నీవే, పరమేశ్వరీ = ఏకైకసత్తాస్వరూపిణివిన్నూ.

**తా :** ఓ జననీ! శాంతమే నీవు. సౌందర్యవతులను మించిన గొప్ప సౌందర్యము గల దానవు. మిక్కిలి శ్రేష్ఠవు. ఏకైకసత్తాస్వరూపిణివిన్నీ నీవే.

**వి :** 1. **సౌమ్యా** – అ) ఉమాసహితః సోమః ఉమాపతిః తస్య భావః సౌమ్యం తద్యస్యాః సా **సౌమ్యా** ఉమాపతిత్వయుతాసి ।

శ్లో॥ సోమదైవతకే సౌమ్యః సౌమ్యం స్యాత్ సుందరేఽపి చ ।
సౌమ్యోఽక్రూరే బుధే సౌమ్యం సౌమ్యః శాంతే ప్రయోగతః ॥ ఇతి
– శాన్తనవీ – దుర్గాసప్తశతీ.

**ఆ) సౌమ్యా** (909) : 1. సోమశీతలత్వాత్ సౌమ్యా ।

ఇ) **సౌమ్యా** – సోమ్యా (910) –

'సోమమర్హతి య' ది సూత్రేణ యత్ ప్రత్యయే సోమయాగార్హా । **సోమ్యా** । ఉమయా సహితః సోమః. సోమోఽవయవో అస్యా ఇత్యర్థే 'మయేచే'తి సూత్రేణ వా యత్ ప్రత్యయః. **అథవా** సోమః కర్పూరచంద్రయోః. **అథవా** సోమ ఇవాహ్లాదికేత్యర్థే శాఖాదిత్వాద్యత్ప్రత్యయః. తత్ర సాధురిత్యర్థే యత్ప్రత్యయో వా. **సౌమ్యా** ఇత్యాదివృద్ధిపాఠే తు చాతుర్వర్ణ్యాదిత్వాత్ స్వార్థే ష్యఙ్' – సౌభాగ్యభాస్కరభాష్యే.

సోమయాగముచే ఆరాధింపదగినది, శివుడు శరీరముగా గలది, కర్పూర – చంద్రుల వలె ఆహ్లాదకారిణి సోమస్వరూపురాలు.

2. **పరమా :** (618) : అ) ఉత్కృష్టమైన పరదేవతా స్వరూపము.

' కలతెఱంగులు నాల్గు కలవందులోన
నికరమౌ దిన్సు తానేయైన వేల్పు
నింగినేలలకుఁబైఁ నెగడు మలప్ప
అడియనందఱి పయి నాడించు జేజె.' – **తల్లివిన్కి.**

ఆ) **పరమా** (618) – పరా సర్వావగాహినీ మా **బుద్ధిః** యస్యాస్సా **పరమా** ।

'యస్సర్వజ్ఞం సర్వవి'దిత్యాది శ్రుతేః । – జయమంగళవ్యాఖ్యా.

ఇ) **పరమా** (618) – పరబ్రహ్మణో రూపచతుష్కమస్తి. తస్మాత్ **పరమా** ఉత్కృష్టా. పరబ్రహ్మకుగల నాలుగు రూపములలో ఉత్కృష్టమైనది **పరమా** అనబడును.

తదుక్తం విష్ణుపురాణే –

శ్లో॥ పరస్య బ్రహ్మణో రూపం - పురుషః ప్రథమం ద్విజాః ।
వ్యక్తావ్యక్తే తథైవాన్యే - రూపే కాలః తథా పరమ్ ।
ప్రధానపురుషవ్యక్త - కాలానాం పరమం హి యత్ ।
పశ్యన్తి సూరయః శుద్ధం - తద్విష్ణోః పరమం పదమ్
ప్రధానపురుషవ్యక్త - కాలాస్తు ప్రతిభాగశః ।
రూపాణి స్థితిసర్గాంత - వ్యక్తిసద్భావహేతవః ॥ ఇతి

**- సౌభాగ్యభాస్కరభాష్యే.**

3. **పరమేశ్వరీ** (397) - అ) పరాత్పరురాలైన ఈశ్వరి.

'ఎక్కువ పాదిసాహి కరువపిల్ల
ఎల్లరిన్వరవుచే నేలించు వేల్పు'. - **తల్లివిన్కి.**

ఆ) **పరమేశ్వరీ** (396) - పరానుత్తశమాచితిః సా చ దేవతా ప్రపంచతయాపి భవితుం పునః స్వాత్మనా చ స్థాతుం చేష్టే ఇతీశ్వరేతి । తథా భైరవభట్టారకేణ తదభాణి -

' యత్కించిత్సకలం రూపం - భైరవస్య ప్రకీర్తితమ్ ।
తదసారతయాం దేవి! - విజ్ఞేయం శక్రజాలవత్ ।
మాయాస్వప్నోపమం చైవ - గంధర్వనగరోపమమ్ ।
ధ్యానార్థం భ్రాంతబుద్ధీనాం - క్రియాడంబరవర్తినామ్ ।
కేవలం వర్తితం పుంసాం - వికల్పే నియతాత్మనామ్ ॥ ఇతి.

తదేవం శ్రీలలితాభట్టారికాయాః చితస్తత్పదలక్ష్యార్థేత్యాద్యుపాదితం **శ్రీవిద్యా** త్వమేవ పారమార్థికం రూపమితి పరిశీలనీయమ్ । - జయమంగళవ్యాఖ్యా.

ఇ) **పరమేశ్వరీ** (397) - పరమా ఉత్కృష్టా చ సా ఈశ్వరీ. స్వామినీ చ.

శ్రేష్ఠురాలగు స్వామిని. గొప్ప ఐశ్వర్యము కలది. - సౌభాగ్యభాస్కరభాష్యే.

శ్లో॥ యో న పూజయతే నిత్యం చండికాం భక్తవత్సలామ్ ।
భస్మీకృత్యాస్య పుణ్యాని నిర్దహేత్ **పరమేశ్వరీ** ॥ 8

- చండీసప్తశతీ - వైకృతికం రహస్యమ్.

---

**శ్లో॥ యచ్చ కిఞ్చిత్ క్వచిద్వస్తు సదసద్వాఽఖిలాత్మికే ।**
**తస్య సర్వస్య యా శక్తిస్సా త్వఙ్కిం స్తూయసే తదా ॥ 11**

**ప్ర :** అఖిలాత్మికే! = అన్నిటా అవ్యక్తంగా అంతర్భూతంగా నున్న అమృతస్వరూపిణీ!

**ఈ, ఈః, ఈం**

**గుహ్యాతిగుహ్యతమం, గురుముఖైకగ్రాహ్యం, అనుభవైకసిద్ధం**



శ్లో॥ ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణమిదముచ్యతే ।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥

**ఓం । శాంతిశ్ శాంతిశ్ శాంతిః । ఓం**

**వి :** '**సర్వం ఖల్విదం బ్రహ్మ**' అను భావస్థాయికి చేరుకొనినపుడు '**కేన కం పశ్యేత్**' '**కేన కం జిఘ్రేత్**' అనునట్టి '**అహం బ్రహ్మాస్మి**' స్థితి యుండుటచే ఉపాస్య – ఉపాసక భేదము రవ్వంతయు / ఇంచుకంతయు నుండదు గనుక 'బ్రహ్మీభూతుడు'గా భాసించును.

**'యా దేవీ సర్వభూతేషు శక్తిరూపేణ సంస్థితా'**

ఓం తత్సత్

**శ్లో॥ యయా త్వయా జగత్స్రష్టా జగత్పాత్యత్తి యో జగత్ ।**
**సోఽపి నిద్రావశం నీతః కస్త్వాం స్తోతుమిహేశ్వరః ॥ 12**

**ప.వి. :** యయా, త్వయా, జగత్స్రష్టా, జగత్పాతి, అత్తి, యః, జగత్, సః, అపి, నిద్రావశమ్, నీతః, కః, త్వామ్, స్తోతుమ్, ఇహ, ఈశ్వరః.

**ప్ర :** (ఓ త్వం స్వరూపిణీ!), (త్వమ్ = నీవు), జగత్స్రష్టా = సృష్టికారకుడగు బ్రహ్మదేవుడవు, యయా త్వయా = ఏ నీచేత, జగత్పాతి = జగత్పాలనము చేయుచున్నాడో, జగత్+అత్తి = జగన్నాశనము చేయుచున్నాడో, సః + అపి = అతడున్నూ, నిద్రావశమ్ = యోగనిద్రను, నీతః = పొందినాడో, ఇహ = ఇట, త్వామ్ = నిన్ను, స్తోతుమ్ = స్తుతించుటకు, కః = ఎవడు, ఈశ్వరః = సమర్థుడు.

**తా :** (ఓ త్వం స్వరూపిణీ!), నీవు సృష్టికారకుడగు బ్రహ్మదేవుడుగా చెప్పబడితివి గదా!, ఏ నీ చేత ఎవడు జగత్పాలనము, జగన్నాశనము చేయుచున్నాడో అతడున్నూ (ఆ శ్రీమన్నారాయణుడున్నూ) నిద్రావశుడైనాడో గదా!, ఇట నిన్ను స్తుతించుటకు ఎవడు సమర్థుడు తల్లీ.

**వి :** ఈశ్వరః – ।పుం । ఈష్టే ఇతి, ఈశ్+వరచ్ । యద్వా అశ్నుతే వ్యాప్నోతీతి । అశ్ ధాతోర్వరట్ ఉపధాయా ఈత్వం చ । హరిః । ఇతి హలాయుధకోశే.

రుద్ర ఉవాచ :

శ్లో॥ హరే కథయ దేవేశ దేవదేవ క **ఈశ్వరః** ।
కో ధ్యేయః కశ్చ వై పూజ్యః కైర్వ్రతైస్తుష్యతే పరః ॥

హరిరువాచ :

శ్లో॥ శృణు రుద్ర ప్రవక్ష్యామి బ్రహ్మణా చ సురైః సహ ।
అహం హి దేవో దేవానాం సర్వలోకేశ్వరేశ్వరః ॥ – ఇతి గారుడే.



**శ్లో॥ విష్ణుశ్శరీరగ్రహణమహమీశాన ఏవ చ ।**
**కారితాస్తే యతోఽతస్త్వాం కస్స్తోతుం శక్తిమాన్భవేత్ ॥** **13**

**ప.వి. :** విష్ణుః, శరీరగ్రహణమ్, అహమ్, ఈశానః, ఏవ, చ, కారితాః, తే, యతః, అతః, త్వామ్, కః, స్తోతుమ్, శక్తిమాన్, భవేత్ ।

**ప్ర :** (యయా త్వయా) యతః తే = యే నీవలన, (సృష్టివిధులు నిర్వర్తించుటకై) అహమ్ = బ్రహ్మదేవుడనైన నేను, విష్ణుః = విష్ణుభగవానుడు, ఈశానః చ = శివభగవానుడున్నూ, శరీరగ్రహణమ్ = శరీరధారులుగా, కారితాః = చేయబడితిమో, అతః ఏవ = అందువలననే,

త్వామ్ = నిన్ను, స్తోతుమ్ = స్తుతించుటకు, కః = ఎవడు, శక్తిమాన్ = సర్వసమర్థుడు, భవేత్ = అగును.

**తా :** యే నీ చేతనే బ్రహ్మదేవుడగు నేను, విష్ణుభగవానుడు, శివభగవానుడు శరీరధారులుగా చేయబడినవారము. (సృష్టివిధులు నిర్వర్తించుటకై). దానివలననే నిన్ను స్తుతించుటకు ఎవడు సర్వసమర్థుడగును? (ఎవడును లేడని భావము.)

**వి : 1. విష్ణుః :** అ) వేవేష్టి వ్యాప్నోతి విశ్వం యః । విష్లృ వ్యాప్తౌ, 'విషేః కిఞ్చ' ఇతి ను। వేషతి సిఞ్చతి ఆప్యాయతే విశ్వమితి వా । విష్ణాతి వియునక్తి భక్తాన్ మాయా ప్రసారేణ సంసారాదితి వా । విశతి సర్వభూతాని, విశన్తి సర్వభూతాని యత్ర వా । 'యస్మాద్విశ్వమిదం సర్వం తస్య శక్త్యా మహాత్మనః । తస్మాదేవోచ్యతే విష్ణుర్విశధాతోః ప్రవేశనాత్' – ఇతి విష్ణుపురాణే । '**బృహత్వాద్విష్ణురుచ్యతే**' ఇతి మహాభారతే । 5-70-3

– ఇతి హలాయుధకోశే.

ఆ) శ్లో॥ శాన్తాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగమ్ ।
లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యం
వన్దే **విష్ణుం** భవభయహరం సర్వలోకైకనాథమ్ ॥ (19)

– శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రే – ధ్యానశ్లోకః.

ఇ) శ్లో॥ విశ్వం **విష్ణుర్వషట్కారో** భూతభవ్యభవత్ప్రభుః ।
భూతకృద్భూతభృద్భావో భూతాత్మా భూతభావనః ॥

– శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రమ్ – 1.

'విశ్వేశ్వరీ సూక్తం/ తంత్రోక్తరాత్రిసూక్తం – ప్రారంభంలో 'యోగమాయాదేవి'ని 'వషట్కారః' – అని పుంభావముతో పేర్కొనబడినది.

'**త్వం స్వాహా త్వం స్వధా త్వం హి *వషట్కారః* స్వరాత్మికా ।** '

2. **ఈశానః** । పుం । ఈష్టే, ఈశ్+ 'తాచ్ఛీల్యవయోవచనశక్తిషు చానశ్ ।

అ) **ఈశానః** :

1. శ్లో॥'తస్మిన్ ముహూర్తే పురసుందరీణా**మీశాన**సందర్శనలాలసానామ్ ।

– ఇతి కుమారసంభవే 7-56.

2. '**తత్రేశానం** సమభ్యర్చ్య త్రిరాత్రో పోషితో నరః।' – ఇతి మహాభారతే.

ఆ) ఏకాదశరుద్రాంతర్గతరుద్రవిశేషః ;

'1. హరాయ, 2. మృడాయ, 3. శర్వాయ, 4. శివాయ, 5. భవాయ, 6. శంకరాయ, 7. **ఈశానాయ**, 8. ఉగ్రాయ, 9. భీమాయ, 10. పశుపతయే, 11. రుద్రాయ మహాదేవాయ స్వాహా' ఇతి ఆశ్వలాయనగృహ్యసూత్రే 4-9.

ఇ) శివాష్టమూర్త్యన్తర్గతసూర్యమూర్తిః ; పరమేశ్వరః ;

' సర్వేంద్రియగుణావాసం - సర్వేంద్రియవివర్జితమ్ ।
సర్వస్య ప్రభుమీ**శానం** - సర్వస్య శరణం బృహత్ ॥ ' ఇతి - కృష్ణయజుర్వేదే.

ఈ) **పంచముఖశివధ్యానమ్...**

***ఓం యం ఈశాన*** **స్సర్వవిద్యానామీశ్వరస్సర్వభూతానాం బ్రహ్మాధిపతిర్ బ్రహ్మణోఽధిపతిర్ బ్రహ్మా శివో మేఽస్తు సదా** ***శివోమ్.***

శ్లో॥ వ్యక్తావ్యక్తగుణేతరం పరతరం **షట్త్రింశత్తత్త్వాత్మకం**
తస్మాదుత్తమతత్త్వ**మక్షర**మితి ధ్యేయం సదా యోగిభిః ।
ఓంకారాది సమస్తమన్త్రజనకం సూక్ష్మాతిసూక్ష్మం పరం
శాంతం పంచమమీశ్వరస్య వదనం ఖ వ్యాప్తతేజోమయమ్ ॥

ఓం నమో భగవతే రుద్రాయ । ఓం యం । ఊర్ధ్వముఖాయ నమః ।

ఉ) 'మహాన్ప్రభుర్వై పురుషస్సత్త్వస్యైష ప్రవర్తకః ।
సునిర్మలామిమాం ప్రాప్తి**మీశానో** జ్యోతిరవ్యయః ।

- యాజుషీయ శ్వేతాశ్వతరోపనిషత్ । 3-12

ఊ) ఇట 'ఈశావాస్యోపనిషత్'ను అనుసంధానము చేసికొనదగును.

3. **భవేత్ :** తిజన్తమ్. భ్వాదిప్రకరణమ్ । భూసత్తాయామ్ (ఉండుట) అకర్మకమ్, సేట్, పరస్మైపదీ. విధిలిఙ్ ప్రథమపురుషైకవచనమ్

ప్ర - **భవేత్** - భవేతామ్ - భవేయుః

మ - భవేః - భవేతమ్ - భవేత

ఉ - భవేయమ్ - భవేవ - భవేమ.

ఇట **దశలకార** ప్రక్రియావిధానమును తెలిసికొందురుగాక.

**శ్లో॥ సా త్వమిత్థం ప్రభావైస్ స్వై-రుదారైర్దేవి! సంస్తుతా ।**
**మోహయైతౌ దురాధర్షా-వసురౌ మధుకైటభౌ ॥** **14**

**ప.వి. :** సా, త్వమ్, ఇత్థమ్, ప్రభావైః, స్వైః, ఉదారైః, దేవి!, సంస్తుతా, మోహయ, ఏతౌ, దురాధర్షౌ+అసురౌ, మధుకైటభౌ।

**ప్ర :** హే దేవి! = ఓ యోగమాయా దేవీ!, స్వైరుదారైః ప్రభావైః = నీ యొక్క ఉదార ప్రభావములవలననే, ఇత్థమ్ = ఇవ్విధంగ, సంస్తుతా = స్తుతింపబడిన, సా త్వమ్ = ఆ నీవు, దురాధర్షౌ = ఎదిరింపరానివారగు, మధుకైటభౌ = మధుకైటభులను, ఏతౌ అసురౌ = ఈ రాక్షసులను, మోహయ = మోహపరచుము.

**తా :** ఓ యోగమాయాదేవీ!, నీయొక్క ఉదార ప్రభావముల వలననే ఆ నీవు ఇవ్విధంగ స్తుతింపబడినావు. ఎదిరింపరానివారగు మధుకైటభులను ఈ ఇరువురు రాక్షసులను మోహపరచుము.

**వి :** 1. **సంస్తుతా** – అ) సమ్యక్ ప్రకారేణ స్తుతిం ప్రాప్తా,

ఆ) సమ్యక్ స్తవవిషయీభూతా.

2. **మధుకైటభౌ** – ద్వితీయావిభక్తి – ద్వివచనం.

శ్లో॥ విష్ణోః ప్రబోధనార్థాయ – నిహన్తుం **మధుకైటభౌ** ।
నేత్రాస్యనాసికాబాహు – హృదయేభ్యస్తథోరసః ॥ 1-90 (చండీ సప్తశత్యాం)

శ్లో॥ ఏకార్ణవేఽహిశయనాత్తతః సదదృశే చ తౌ ।
**మధుకైటభౌ దురాత్మానావతివీర్యపరాక్రమౌ ॥** 1-92

3. **దురాధర్షౌ** – 1. దురాత్మానౌ , 2. అతివీర్యపరాక్రమౌ

4. **మోహయ –** అ) ముహ(ముహ్) వైచిత్యే – మోహము చెందుట

అకర్మకమ్, వేట్, పరస్మైపదీ, ణిజన్తమ్. లోట్ మధ్యమపురుషైకవచనం.

**మోహయ**/మోహయతాత్ – మోహయతమ్ – మోహయత

(**ణిజన్తం** – ప్రయోజక వ్యాపారమునుగాని, ప్రేరణార్థమునుగాని చెప్పుటకు ధాతువుపై ణిచ్ (ఇ) ప్రత్యయము చేరును. **హేతుమతి చ 3-1-26** ఈ ణిజన్తము సనాద్యన్తా ధాతవః (సూ 3-1-32) అను సూత్రముచే ధాతుసంజ్ఞ కలిగియుండుటచే దీనిపై లడాదులు వచ్చును. ఇవి ఉభయపదులు.)

ఆ) ఓం అస్య శ్రీహనుమత్బడబానలస్తోత్రమహామంత్రస్య శ్రీరామచంద్ర ఋషిః, శ్రీబడబానల హనూమాన్ దేవతా. మమ సమస్తరోగప్రశమనార్థమ్ ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధ్యర్థం సమస్తపాపక్షయార్థం సీతారామచంద్రప్రీత్యర్థం హనుమత్ బడబానలస్తోత్రజపమహం కరిష్యే।

ఓం హ్రాం హ్రీం ఓం నమో భగవతే శ్రీమహాహనుమతే ప్రకటపరాక్రమ సకల దిఙ్మండల – యశోవితానధవళీకృతజగత్త్రియ వజ్రదేహ రుద్రావతార లంకాపురీదహన ఉమా అమలమంత్ర ఉదధిబంధన దశశిరః కృతాంతక సీతాశ్వసన వాయుపుత్ర అంజనీగర్భ సంభూత శ్రీరామలక్ష్మణానందకర కపిసైన్యప్రాకార సుగ్రీవసాహాయ్యకరణ పర్వతోత్పాటన కుమారబ్రహ్మచారిన్ గంభీరనాద సర్వపాపగ్రహవారణ సర్వజ్వరోచ్చాటన డాకినీ విధ్వంసన

ఓం హ్రాం హ్రీం ఓం నమో భగవతే మహావీరాయ సర్వ దుఃఖనివారణాయ గ్రహమండల సర్వభూతమండలసర్వపిశాచమండలోచ్చాటన భూతజ్వర ఏకాహ్నికజ్వర ద్వ్యాహ్నికజ్వర త్ర్యాహ్నికజ్వర చాతురహ్నికజ్వర సంతాపజ్వర విషమజ్వర తాపజ్వర మాహేశ్వరవైష్ణవజ్వరాన్ ఛింధి ఛింధి భింది భింది యక్షబ్రహ్మరాక్షసభూతప్రేతపిశాచాన్ ఉచ్చాటయ ఉచ్చాటయ

ఓం హ్రాం హ్రీం ఓం నమో భగవతే శ్రీమహాహనుమతే

ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః ఆం హాం హాం హాం ఔం సౌం ఏహి ఏహి

ఓం హం ఓం హం ఓం హం ఓం హం ఓం నమో భగవతే శ్రీమహాహనుమతే శ్రవణచక్షుర్భూతానాం శాకినీడాకినీనాం విషమదుష్టానాం సర్వవిషం హర హర ఆకాశభువనం భేదయ భేదయ ఛేదయ ఛేదయ మారయ మారయ శోషయ శోషయ **మోహయ మోహయ** జ్వాలయ జ్వాలయ ప్రహారయ ప్రహారయ సకలమాయాం భేదయ భేదయ

ఓం హ్రాం హ్రీం ఓం నమో భగవతే మహాహనుమతే సర్వగ్రహోచ్చాటన పరబలం క్షోభయ క్షోభయ సకలబంధనమోక్షణం కురు కురు శిరఃశూలగుల్మశూలసర్వశూలా– న్నిర్మూలయ నిర్మూలయ నాగపాశానంతవాసుకితక్షకకర్కోటకకాలియాన్ యక్షకుల జలగత బిలగత రాత్రించర దివాచర సర్వాన్నిర్విషం కురు కురు స్వాహా ।

రాజభయ చోరభయ పరమంత్ర పరయంత్ర పరతంత్ర పరవిద్యా ఛేదయ ఛేదయ స్వమంత్ర స్వయంత్ర స్వతంత్ర స్వవిద్యాః ప్రకటయ ప్రకటయ సర్వారిష్టాన్నాశయ నాశయ సర్వశత్రూన్నాశయ నాశయ అసాధ్యం సాధయ సాధయ హుం ఫట్ స్వాహా ।

**ఇతి శ్రీవిభీషణకృతం హనుమద్బడబానలస్తోత్రం సంపూర్ణమ్ ।**

---

**శ్లో॥ ప్రబోధఇ్చ జగత్స్వామీ నీయతామచ్యుతో లఘు ।**
**బోధశ్చ క్రియతామస్య హన్తుమేతౌ మహాసురౌ ॥ 15**

**ప.వి. :** ప్రబోధమ్, చ, జగత్స్వామీ, నీయతామ్, అచ్యుతః, లఘు, బోధః, చ, క్రియతామ్, అస్య, హన్తుమ్, ఏతౌ, మహాసురౌ! ।

**ప్ర :** (హే యోగనిద్రాదేవి!), (యయా త్వయా = ఏ నీచే), జగత్స్వామీ = జగదీశ్వరుడగు, అచ్యుతః = శ్రీమన్నారాయణుడు, లఘు = శీఘ్రముగ (యోగనిద్రనుండి మేల్కొనుట అను), ప్రబోధమ్ = ప్రబోధమును, నీయతామ్ = పొందబడుగాక, (యయా త్వయా = ఏ నీచే), ఏతౌ మహాసురౌ = ఈ మధుకైటభులనెడు దుష్టరాక్షసులను, హన్తుమ్ = సంహరించుటకు, అస్య = శ్రీమన్నారాయణుడగు విష్ణుభగవానునికి, బోధః = జ్ఞానము, క్రియతామ్ = కలుగ చేయబడుగాక.

**తా : ఓ యోగనిద్రాదేవీ!** నీ చేతనే జగదీశ్వరుడగు శ్రీమన్నారాయణుడు శీఘ్రముగ ప్రబోధింపబడుగాక. (అనగా యోగనిద్ర నుండి బహిర్ముఖుడగు నట్లు జరుగుగాక యని భావము). నీచేతనే మధుకైటభులనెడు దుష్టరాక్షసులను సంహరించ వలెననెడి జ్ఞానము విష్ణుభగవానునికి కలుగ చేయబడుగాక.

**వి :** 1. **లఘు –** అ) అవ్యయమ్ । శైఘ్ర్యే వర్తతేఽయమ్ । క్రియావిశేషణమేతత్ । క్లీబాంతత్వమేవాస్య బహుసమ్మతమ్ ।

'సత్త్వం **లఘు** ప్రకాశకమ్' – ఇతి । సాంఖ్యకారికా – 13

ఆ) **లఘు ।** క్లీ । లంఘతే అనేనేతి । లంఘ్ + 'లంఘి బహ్యోర్నలోపశ్చ' ఇతి కు ధాతోర్నలోపశ్చ । శీఘ్రం, క్షిప్రం, ఝటితి;

శ్లో॥ యావదేవ తు సుప్తాస్తావదేవ వయం **లఘు ।**
రథమారుహ్య గచ్ఛామః పన్థానమకుతోభయమ్ ॥ ఇతి రామాయణే 2–46–21

2. **అచ్యుతః :** । పుం । న చ్యవతే స్వరూపతో న గచ్ఛతి యః, నిత్య ఇతి యావత్ । చ్యు + కర్తరి క్త. నఞ్ సమాసః । విష్ణుః । 'పీతాంబరోఽచ్యుతః శార్ఙ్గీ' – ఇత్యమరః।

శ్లో॥ 'తత్రావతీర్యా**చ్యుత**దత్తహస్తః' – ఇతి కుమారసంభవే ।

శ్లో॥ జనార్దనాధోక్షజవాసుదేవం దామోదరం శ్రీధర**మచ్యుత**ఇచ్ఛ ।
ఉపేంద్రమింద్రావరజం చ బభ్రుం హరిం హృషీకేశముదాహరన్తి ॥ 23

– ఇతి హలాయుధకోశే.

2. శ్లో॥ వేధాః స్వాంగోఽజితః కృష్ణో దృఢః సంకర్షణో**ఽచ్యుతః** ।
వరుణో వారుణో వృక్షః పుష్కరాక్షో మహామనాః ॥ 59

– శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రమ్.

భాష్యమ్ – **అచ్యుతః** (557) వ్యాహేపి 'చ్యవనోత్పత్తియుక్తేషు బ్రహ్మేన్ద్రవరుణాదిషు యస్మాన్న చ్యవసే స్థానాత్ తస్మాత్ సంకీర్త్యసేఽ**చ్యుతః** ॥ ఇతి – అచ్యుతః ।

**అచ్యుతః** (101) :

శ్లో॥ అజస్సర్వేశ్వరః సిద్ధః సిద్ధిస్సర్వాది**రచ్యుతః** ।
వృషాకపిరమేయాత్మా సర్వయోగవినిస్సృతః ॥ – 11

– శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రమ్.

**భాష్యమ్** – తేభ్యః ప్రపన్నేభ్యోఽనపగతః – (**అచ్యుతః**) '**యస్మాన్నచ్యుత పూర్వోహ మచ్యుతస్తేన కర్మణా**' ; '**తస్యాహం న ప్రణశ్యామి**'; '**న త్యజేయం కథఞ్చన**' ఇతి.

1. '**యస్మాత్...**' అనునది 'నేనెప్పటికిని భక్తులను విడిచియుండను కనుక 'అచ్యుతః' అని చెప్పబడుచున్నానని భగవంతుడే **పాంచరాత్రము**న చెప్పినది.

2. '**తస్యాహం...**' అనునది 'భక్తుని నేను విడిచియుండను' అని చెప్పుచున్నది భగవద్గీతలోని ఈ శ్లోకము.

3. '**న త్యజేయం కథఞ్చన...**' అనునది 'శరణాగతుడైన వానిని ఎన్నటికిని విడువజాలను' అని చెప్పుచున్నదీ రామాయణ శ్లోకము. 'విభీషణ శరణాగతి' న శ్రీరాముని వాక్యము.

శ్లో॥ 'అపరాధసహస్రాణి క్రియంతేఽహర్నిశం మయా ।
దాసోఽయమితి మాం మత్వా క్షమస్వ **పరమేశ్వరి!** ॥

**ఇతి 'ప్రతిపదవ్యాఖ్యాసమ్మిళితమదీయ 'మృణాళినీ' సర్వతో భాసితా'**

శ్రీః



శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రమ్ - అనుబంధం -1

**శఙ్కరభాష్యమ్**

అత్ర నామసహస్రే ఆదిత్యాదిశబ్దానామర్థాన్తరే ప్రసిద్ధానామాదిత్యాద్యర్థానాం తద్విభూతిత్వేన తదభేదాత్తస్యైవ స్తుతిరితి ప్రసిద్ధార్థగ్రహణేఽపి తత్ స్తుతిత్వమ్.

**శ్లో॥ భూతాత్మా చేన్ద్రియాత్మా చ ప్రధానాత్మా తథా భవాన్ ।**
**ఆత్మా చ పరమాత్మా చ త్వమేకః పఞ్చధా స్థితః ॥** విష్ణు.పు. 5-18-50)

**శ్లో॥ జ్యోతీంషి విష్ణుర్భువనాని విష్ణుర్వనాని విష్ణుర్గిరయో దిశశ్చ ।**
**నద్యస్సముద్రాశ్చ స ఏవ సర్వం యదస్తి యన్నాస్తి చ విప్రవర్య! ॥**

- వి.పు. 2-12-38

ఆదిత్యానామహం విష్ణుః (10-21) ఇత్యారభ్య

అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున ।
విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్ ॥

- ఇతి పర్యన్తం గీతాయామ్ 10-42

బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠమ్ (ముం.ఉ. 2-2-11)

పురుష ఏవేదగ్ం విశ్వమ్ (ముం. ఉ. 2-1-10) ఇది శ్రుతిశ్చ.

విష్ణ్వాదిశబ్దానాం పునరుక్తానామపి వృత్తిభేదేనాఽర్థభేదాన్న పౌనరుక్త్యమ్ ।

శ్రీపతిర్మాధవ ఇత్యాదీనాం వృత్త్యైకత్వేఽపి శబ్దభేదాన్న పౌనరుక్త్యమ్ ।

'అర్థైకత్వేఽపి న పౌనరుక్త్యం దోషాయ నామ్నాం సహస్రస్య కిమేకం దైవతమ్' ఇతి పృష్టేరేకదేవతా విషయత్వాత్ ।

యత్ర పుంల్లిఙ్గశబ్దప్రయోగస్తత్ర విష్ణుర్విశేష్యః. యత్ర స్త్రీలిఙ్గశబ్దస్తత్ర దేవతా విశేష్యతే, యత్ర నపుంసకలిఙ్గశబ్దస్తత్ర బ్రహ్మేతి విశేష్యతే ।

శ్రీః



**ఆంధ్రానువాదము**

ఈ సహస్ర నామముల యందలి ఆదిత్యాది శబ్దములు అర్థాన్తరప్రసిద్ధము లయినను, ఆ ఆదిత్యాదులు పరమాత్మభూతులే కనుక, పరమాత్మతో అభేదమే యగుట చేత ప్రసిద్ధార్థగ్రహణములో కూడ పరమాత్మస్తుతియే యగును.

నీవు భూతాత్మవు, ఇన్ద్రియాత్మవు, ప్రధానాత్మవు, ఆత్మవు, పరమాత్మవు, ఇట్లు పంచ విధములుగా నీవొక్కడవే ఉంటివి.

జ్యోతిస్సులు విష్ణువు, భువనములు విష్ణువు, వనములు, పర్వతములు, దిక్కులు, నదులు, సముద్రములు, ఈ సర్వము విష్ణువే, 'అస్తి' అనబడునదియు, 'నాస్తి' అనబడు నదియు (లయమగుట ఆ స్వరూపమందే కనుక) విష్ణువే అని విష్ణుపురాణము చెప్పుచున్నది.

భగవద్గీతలో – 'ఆదిత్యులలో విష్ణువు నేను, అని ఆరంభించి చెప్పుచు నా విభూతులు తెలిసినంతమాత్రమున నా స్వరూప మేమి తెలిసినట్లు? నిఖిల ప్రపంచమును నేను ఏకాంశము చేతనే వ్యాపించి యున్నానని భగవంతుడుపదేశించి యుండెను.

ఈ సమస్త జగత్తు బ్రహ్మయే, ఈ సమస్తము పురుషుడే అని శ్రుతి యుద్ఘోషించు చున్నది.

ఈ నామములలో విష్ణ్వాదిశబ్దములు పునరుక్తములైయున్నను వృత్తి భేద మూలకమైన అర్థభేదముచేత పునరుక్తి కానేరదు. శ్రీపతి, మాధవ – ఇత్యాది శబ్దములు అర్థభేదములేని వైనను శబ్దభేదమును బట్టి పునరుక్తి కానేరదు. ఏకార్థ మూలక పునరుక్తి దోషావహము కాదు. ఏకదైవత ప్రశ్నపై చెప్పబడిన నామసహస్రము ఏక దేవత విషయమై యుండుట వలన పునరుక్తిదోషము లేదు.

ఈ నామములలో పు(ం)ల్లింగ శబ్ద ప్రయోగమున్న స్థలమున విష్ణువు విశేష్యము, స్త్రీలింగశబ్దము ప్రయుక్త మయినపుడు దేవత విశేష్యము, నపుంసకలింగశబ్దము ప్రయుక్తమైనపుడు బ్రహ్మము విశేష్యము అని గ్రహింపవలెను.

శ్రీః



## అథ వేదోక్తం రాత్రిసూక్తమ్ - అనుబంధం -2



ఓం రాత్రీత్యాద్యష్టర్చస్య సూక్తస్య । కుశికః సౌభరో రాత్రిర్వా భారద్వాజ ఋషిః । రాత్రిర్దేవతా । గాయత్రీ ఛందః । దేవీమాహాత్మ్యపాఠే వినియోగః ।

। ఓం నమశ్చండికాయై ।

ఓం రాత్రీ వ్యఖ్యదాయితీ పురుత్రా దేవ్యక్షభిః । విశ్వా అధిశ్రియోఽధిత । 1 । ఓర్వప్రా అమర్త్యానివతో దేవ్యుద్వతః । జ్యోతిషాబాధతే తమః ॥ 2 ॥ నిరు స్వసారమస్కృతోషసం దేవ్యాయతీ । అపేతు హాసతే తమః ॥ 3 ॥

సా నో అద్య యస్యా వయం ని తే యామన్నవిక్ష్మహి । వృక్షే న వసతిం వయః ॥ 4 ॥ ని గ్రామాసో అవిక్షత ని పద్వంతో ని పక్షిణః । ని శ్యేనాసశ్చిదర్థినః ॥ 5 ॥ యావయా వృక్యం వృకం యవయస్తేనమూర్మ్యే । అథా నః సుతరా భవ ॥ 6 ॥

ఉప మా పేపిశత్తమః కృష్ణం వ్యక్తమస్థిత । ఉప ఋణేవ యాతయ ॥ 7 ॥ ఉప తే గా ఇవాకరం వృణీష్వ దుహితర్దివః । రాత్రి స్తోమం న జిగ్యుషే ॥ 8 ॥

(ఋగ్వేదం మం.10, అ-10, సూ.127, మంత్రము 1-8 వరకు)

ఇతి వేదోక్తం రాత్రిసూక్తమ్

**ఓం**

**శ్రీః**



